భారతీయ సాహిత్య నిర్మాతలు

# వేదము వేంకటరాయశాస్త్రి

ఆంగ్ల మూలం - తెలుగు సేత :

వేదము వేంకటరాయశాస్త్రి (జూనియర్)



సాహిత్య అకాదెమీ

న్యూఢిల్లీ

# విజ్ఞప్తి

మా తాతగారు, శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు 1929 లో గతించు నాటికి నాకు పదునారేండ్ల వయస్సుమాత్రమే. అందువలన వారిని గురించి సాహితీపరముగా నాయెరుక సమగ్రముగాగాని నిర్దుష్టముగాగాని ఉండుట కవకాశములేదు. వారిని గురించి నేనెంతో తెలిసికొన వీలులేకపోయినది. వారి సమకాలికులు, వారి శిష్యులుగాని, అభిమానులుగాని వారిని గురించి తృప్తి కరమైన రచన ఏదియు చేయలేదు. వారిని గురించి మనుమడనుగా ఎక్కువ ఎరుగుదునేగాని శిష్యుడనుగా ఎరుగను. కాని వారితో నిరంతరము ఉండి నందువలన యదృచ్ఛగా ఎంతో గ్రహించితిని. వారు గతించిన తర్వాత వారి శిష్యుల వద్దనుండి సక్రమముగా ఇకనింత గ్రహించితిని. అట్లు సంపాదించిన విషయములను పోల్చి, సమన్వయపరచుకొనుచు, వారి వ్రాతలనుండియు, వారు చేర్చియుంచుకొనినవానినుండియు, పత్రికలలో ప్రచురితములైన వృత్తాంతముల నుండియు, సంపాదించిన విషయములతో చేర్చి ఒక సమగ్ర మైన జీవితచరిత్రమును వ్రాసికొంటిని. దానిని కీ. శే. డాక్టరు అల్లాడి కృష్ణస్వామి అయ్యరుగారు చూచి మెచ్చుకొనగా, క్రీ. శ. 1943లో నేను డా॥ సి. ఆర్. రెడ్డిగారి మున్నుడితో ప్రకటించితిని.

ఈ విధముగా తాతగారిని గురించి అల్పజ్ఞుడనైన నేను వ్రాయుట ఏర్పడినది. విషయమా విస్తృతము, వైవిధ్యబహుళము. తాతగారొకసంస్థ వంటివారు. వారిని గురించి నేనెంత చక్కగా వివరించినను, అది ఆ వాఙ్మయ జీవిత వైభవము యొక్క నీడనుమాత్రము చూచుటయగును. ఎక్కువ విషయము వారి రచనలను పఠించి ధ్యానించి తెలిసికొనవలసినదే. వారిని గురించి నిర్దుష్టముగాను, సాధువుగాను వ్రాయుటమాత్రమేకాదు, రచనా విధానము కూడ నాకు శ్రమకలిగించినది. లెక్కలేని వివాదాస్పదవిషయ ములను జాగ్రత్తగా మానవలసి వచ్చినది. ఎంతోవిషయ బాహుళ్యము సంగ్రహింప వలసివచ్చినది. ఈ కారణముల చేత ఈ రచన కేవలము వారి వాఙ్మయ విమర్శ కన్న చాలవరకు వారి జీవితచరిత్రకథనముగా మారినది. దీనిని ఇంతకన్న బాగుగా వ్రాయుటకును పెక్కుకోణములనుండి విషయ విమర్శ చేయుటకును అవకాశమెంతైనను కలదని దీనిని పఠించు వారు గ్రహింతురని నానమ్మకము. ఇట్టి క్షమార్పణతో ఈపుస్తకమును, చిన్నదైనను, ప్రకటించుటలో నా ఆశయము ఇంతకన్న విస్తృతమును అన్నివిధముల మేలునైన రచన ఎవరైనను, చదివి పరిశోధించి చేయవలయుననియు, అట్టివానికి ఇది ఉపోద్ఘాతప్రాయమని మాత్రమే.

బహువ్యాప్తముగా అనేకులు చదువుట కుపయోగపడునట్లు దీనిని ఆంగ్లములో వ్రాయుటకు నాకవకాశమిచ్చిన న్యూఢిల్లీ సాహిత్య అకాడెమీ వారికి నేనెంతో కృతజ్ఞుడను. వీరికేగాక, ఈ నా రచనను వ్రాతలోచూచి చక్కని సూచనలు చేసిన పెద్దలకు, తాతగారి శిష్యులును అభిమానులు నైనవారికి, కీ. శే. శ్రీమాన్ నేలటూరు రామదానయ్యంగార్ వారికిని, శ్రీ గుఱ్ఱము వేంకటసుబ్రహ్మణ్యము (ప్రస్తుతము నెల్లూరిలో న్యాయవాది) గారికిని, నా కృతజ్ఞతలు.

వేదము వేంకటరాయశాస్త్రి
(మనుమడు)

## విషయసూచిక

# ప్రవేశిక

'ఆంధ్ర వాఙ్మయములో వేదము వేంకటరాయశాస్త్రిగారి పేరొక సమ్మోహన మంత్రము' అని వ్రాసినారు దేశభక్తులును విద్వాంసులునైన శ్రీగాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు 1938, డిసంబరు 11 తేది నాటి హిందూ పత్రికలో శాస్త్రిగారి యొక పుస్తకమును సమీక్షించుచు. ఇది చాల వరకు, ఆంధ్రవాఙ్మయ రంగమందు, పందొమ్మిదవ శతాబ్దపు ఉత్తర పాదము నుండి ఇరువదవ శతాబ్దపు పూర్వపాదము వఱకు, అర్ధశతాబ్దకాలము, అగ్రేసరుడుగా వెలిగిన భాషారాధకశ్రేష్ఠుని గూర్చిన సారభూతమైన సంగ్రహ వర్ణన. పందొమ్మిదవశతాము, సామాన్యముగా, భారతదేశ చరిత్రమందును, ముఖ్యముగా వాఙ్మయరంగమందును, సృజనాత్మక నూతన మార్గదర్శకము. పాశ్చాత్య సంసర్గముచేత మనభాషలన్నియు క్రొత్తపోకడలు ప్రారంభించినవి. ఆంధ్రభాషారాధకులు ప్రాచీన సంప్రదాయానుసారులైన పండితులు మాత్రమే గాక ఆధునిక విద్యా సంస్కారమునందినవారుగా కూడ నుండినది తెలుగు యొక్క అదృష్టము. అటువంటి పునరుజ్జీవన కాలమునకు చెందిన యీ పండితులు నూతన మార్గదర్శకులగుటకు ఎంతయు తగినవారై యుండిరి. అట్టివారిలో నొకరైన, మా తాతగారు, శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారి వాఙ్మయ సేవ విశిష్టస్థానమునందినది. వారి గాఢపాండిత్యము, విస్తృత బహుముఖ రచనాపాటవము, ఆచరణయోగ్యమైన సంపూర్ణలోకజ్ఞానము, చక్కని సునిశితచమత్కారహాస్య భావము - సమకాలికుల మీద ఎంతో ప్రభావముచూపినది.

పూర్వాచారపరాయణులైన పండితుని కుమారుడైయుండియు శాస్త్రిగారు మొదట మొదట ఇంగ్లీషే నేర్చుకొనిరి, ఆ తర్వాతనే సంస్కృతాంధ్రములు, ఆశ్చర్యమే! ఇందులకు కారణము సందర్భములే. బి.ఏ. చదివిన తర్వాతనే, తెలుగు వాఙ్మయమునకు వచన రచనలో, కవితలో, నాటకములో, విమర్శలో, నిఘంటునిర్మాణములో నూతన వాతావరణమును సృజించినారు. చక్కని విమర్శకుడును, మేలైన ఉపాధ్యాయుడునైనందున, విద్యార్థులు ఉపాధ్యాయనిరపేక్షముగా, ఇండ్లలోనుండి, తామే చదువుకొనుటకు తగినట్లు, విస్తృతవ్యాఖ్యలతో పెక్కు సంస్కృతాంధ్రగ్రంథములను ముద్రించిరి. వినుచుండుకొలది కుతూహలము రేకెత్తించు వక్తయైనందున, ఎన్ని సభలలోనో క్రిక్కిరిసిన సామాజికులకు, మన హైందవవిజ్ఞాన సంస్కృతులను గుఱించి వినోదకరముగా బోధించి వారిని తదేకతానులగునట్లు చేసి

నారు. సృజనాత్మకరచయితయైనందున నూతనముగా నాటకములు వ్రాసి, సంస్కృతమునుండి అనువదించి, ఆ నాటకముల ను కళాశాలలోను, ఇతరత్రను ఆడించి, ఆంధ్ర నాటకరంగమునకు నూతనోత్తేజమును కలిగించిరి. కార్య దక్షులుగాన ఒక ముద్రణాలయమును ప్రారంభించి, పలురకములైన అక్షరములు తెప్పించి, తమ రచనలను వివిధరూప పరిమాణము (సైజు)లలో చక్కగా విడదీసి, కామాలు మొదలైన గుర్తులు పెట్టి, సులభముగా అర్థమగునట్లు మార్గదర్శకముగా, సరసమగు వెలలలో, బహువ్యాపకముగా నుండునట్లు ముద్రించినారు. ఆహ్లాదకర సంభాషణాచతురులైనందున, తమ వినోద మధుర ఇతివృత్తముల చేత, తమ విద్యార్థులనేగాక, ఎందరినో వాఙ్మయాభిలాషులను ఆకర్షించుచుండిరి. వారందఱును వారిని పలుమార్లు సందర్శించి, భక్తిప్రపత్తులతో ఎన్నో విషయములు తెలిసికొనుచుండిరి. ఎంతో లోకజ్ఞానము ఇంగితజ్ఞానములతో, సక్రమాలోచనాపరులైనందున, వారి గ్రంథ పఠన పరిశోధనా విధానము, పరిశోధక పండితులకు కాలహరణములేని మార్గమున, సులభముగా, బహు విషయబోధకముగా నుండెడిది. అపారమైన జ్ఞాపకశక్తి, బహువిస్తృత పాండిత్యము - వీని చేత తమ మిత్రులకును, విద్యార్థులకును, ఎప్పటి కప్పుడు, సంస్కృతాంధ్ర గ్రంథములనుండి, సద్యఃస్ఫూర్తితో ఉదాహరించి, వారి వారి ప్రశ్నలకు సమాధానము లిచ్చుచు, సందేహములు తీర్చుచు సజీవభాండాగారముగా నుండిరి. కార్యనిర్వహణమందు రాక్షస శక్తి గలిగియుండినందువలన, పర్వతోపమానములైన పనులనే, అసహాయుడుగా పూనుకొని, ఎందరో పండితులు ఒక సమాజముగా కలిసి చేయదగిన దానిని సులభముగా చేసినారు. సనాతనమతానుయాయులై నందున, సంఘ సంస్కర్తలను, అతిత్వరగా సంఘ సంస్కరణము చేయ గోరునుత్సాహముతో, శాస్త్రములకు అపార్థములు కల్పించుచుండిన వారిని ఎదిరించినారేగాని, కాలానుగుణ్యములైన సాంఘిక సంస్కరణములకు సుముఖులుగానే యుండిరి. ఇంతకును ప్రబలకారణము వారి పాశ్చాత్యవిద్యా ప్రభావము, ఆంగ్ల భాషా పరిజ్ఞానము, సమకాలికదేశ కాల పరిస్థితి - మున్నగునవియే.

# 1. పూర్వచరిత్ర

ఆంధ్రులభాషకు తెలుగని కూడ మఱియొక పేరు. ఆంధ్ర వాఙ్మయము అనేక విధములలో సంస్కృత వాఙ్మయము యొక్కయు, భావముల యొక్కయు పరంపరానుసారియే, దాని యొక్క పొడిగింపే, ఉత్తరదక్షిణ భారతదేశములకు నడుమ, ఆర్యద్రావిడ సంస్కృతులనబడువానికి మధ్యస్థమైనందువలన, ఆ రెండింటికి చక్కని సమ్మేళన రూపమున కుదిరినది ఆంధ్రసంస్కృతి. పదజాలములోను, భాషానిర్మాణములోను, ద్రావిడభాషా జన్యమై, మూలస్వభావమును వదలక, సంస్కృతభాషా వాఙ్మయ భావములను, వక్కణలను గ్రహించి, సంస్కృతభాషయొక్క ధాటితో, రెంటిలోని మేలిముల కలయికయై, ఒకనూతనశైలిని నిర్మించుకొన్నది ఆంధ్రభాష. సంస్కృతవిద్యాపీఠములు పైనుండి క్రమముగా క్రిందికి దిగినవి. కాశ్మీరము నుండియు, కన్యాకుబ్జమునుండియు, ఉజ్జయినినుండియు వారాణసినుండియు, క్రిందికిదిగి, ఓరుగల్లు, విజయనగరము, రాజమహేంద్రవరము నెల్లూరు నగరములకు వచ్చి చేరినది. సంస్కృతము ఎంత వ్యాపించినదనగా, తెలుగు కవులు తాము వ్యాసవాల్మీకులకును, భాస కాళిదాసాదులకును వారసులమని తలంచినారు. సంస్కృతాంధ్రములలో నిష్ణాతులైన కవులు సంస్కృత కావ్య నాటకములను అనువదించి చదివి వినిపించుచుండగా, ప్రజలు తదేకతానులై గుంపులు గూడి వినెడివారు. తెలుగు కవులు సంస్కృత కవులనే తమకు ఆదర్శముగా, మార్గదర్శకులుగా, గ్రహించి, ఆ ఉద్రేకముతో చంపూ కావ్య నాటకములను, ఆ మార్గముననే రచించిరి. ఆంధ్రకవిత్వభావవీధి సంస్కృత కవులభావములయొక్క క్రమపరిణామముగానే కనబడుచున్నది. వాస్తవము చూడగా, ఆ సంస్కృత మేధావుల వంశీయులే తర్వాత తెలుగులో రచియించిరి. ఇతర కార్మిక శాస్త్రీయ విద్యలలో, సంగీత నృత్యములలో సంస్కృత 'మార్గ' పద్ధతియే, తర్వాతి 'దేశీయ' వాఙ్మయ సౌధనిర్మాణమునకు పునాది యైనది. సంస్కృత పర్యాయ పదములు, ఆదర్శక సూత్రములు దారి చూపగా నిర్మాణమునందలి పనితనము వస్తువికాసము ఆ యా ప్రాంతీయత ననుసరించినది.

శాసనాధారములచేత తెలుగు కవిత్వము క్రీస్తు తర్వాత ఏడెనిమిది శతాబ్దుల ప్రాంతమున ప్రారంభమైనట్లున్నను, మనకు లభించిన మొదటి గ్రంథము, పదునొకండవ శతాబ్దము నడుమ, సంస్కృతమూలమునుండి ఆంధ్రీకరింపబడిన, నన్నయ రచిత, ఆంధ్రమహాభారతము, (క్రీ. శ. 1050-

1061) తర్వాత కవులలో నొక్కొక్కడును నన్నయను ఆదికవియనియు. వాగనుశాసనుడు (భాషామార్గదర్శి) అనియు, ఉద్ఘాటించియున్నాడు. ఆతనికి ముందు చెప్పుకోదగ్గకావ్యములేనందున కావ్యరచనకు ఆదర్శరచన చేసి కావ్యశైలికి ఒకపద్ధతి చూపినాడేమో. సంస్కృత వాఙ్మయ మందలి ఇతిహాస, పురాణ, చంపూ కావ్యములు ఆంధ్రభాషలోనికి అనువదింపబడిన విధము చూడగా దేశమంతయు ఒక అనువాద ప్రణాళిక ననుసరించియున్నట్లు కనబడును. అన్నియు పద్య రచనలే, ఛందోబద్ధములే, కాని వచన రచనను గుఱించి ఎవరును తలపెట్టినట్లు లేదు. అంకగణిత రేఖా గణిత గ్రంథములు కూడ పద్యములలోనే వ్రాయబడినవి. ఇట్లు వ్రాయుట విద్యార్థులు వల్లెవేసి సులువుగా జ్ఞప్తియందుంచుకొనుటకొఱకే యుండును. ప్రాంతీయ భాషలు అభి వృద్ధియగు కొలదియు జనులలో వానికి ప్రాముఖ్యమేర్పడి సంస్కృత (రంగ) నాటకములు వెనుకబడి, ప్రాచీన సంప్రదాయమునకు ఉనికిపట్లయి, మారు మూలలలో తల దాచుకొన సాగినవి. సామాన్యముగా వీధి నాటకములనబడు యక్షగానములు వెలువడి, ప్రజాదరమును పొందసాగినవి. ఇది విజయనగర రాజుల కాలము నుండియు స్పష్టముగా తెలియుచున్నది. విజయనగర పతనానంతరము కావ్యరచన తగ్గి, యక్షగానములు వ్యాపింపసాగినవి. వీనిలో సంగీతమును నాటకీయతయు ఎక్కువ ప్రాధాన్యతను పొందినవి. ఆంధ్రదేశములో పెక్కుతావులలో ఆదరింపబడుచుండినను, దక్షిణాంధ్ర దేశములో (మధుర తంజాపుర్యాదులలో) పదునేడవశతాబ్దము నాటికి మహోన్నతస్థితినందుకొన్నది. యక్షగానమునకు వచన రచనకును కూడ ప్రారంభము తంజావూరులోను దక్షిణాంధ్రమందలి పలుతావుల యందును పదునెనిమిదవ శతాబ్దములో కనబడుచున్నది. నేటి వచనరచన ఏర్పడి, అది చాల త్వరగా వృద్ధినందుట పందొమ్మిదవ శతాబ్దమునుండియే.

భారతదేశ చరిత్రయందు పందొమ్మిదవ శతాబ్దము యొక్క ఉత్తరార్ధము నుండియే గొప్పమార్పులు ఏర్పడినవి. ఇందు ఆంధ్రదేశమును వెనుదీయలేదు. ఎందరో ప్రాచీన భారతీయ చక్రవర్తులు ఐక్యభారతదేశమునకు గన్నకలలు ఫలించినవి. పదునెనిమిది పందొమ్మిది శతాబ్దములలో మొగలాయీల యొక్కయు పీష్వాల యొక్కయు పతనముతోను, ఈస్టు ఇండియా కంపెనీ వారి ఆధిపత్య ప్రాదుర్భావముతోను, రాజకీయముగా, భారతదేశమునకు దేశీయైక్యము ఏర్పడినది. ఇంత దృఢమైన ఐక్యభావము అంతకుముందు లేదు. విక్టోరియా మహారాణి యొక్క పరిపాలన క్రింద బ్రిటిషువారి పరిపాలన ఏర్పడి, అందువలన ఈ ఐక్యము స్థిరపడినది. దానికి బలము చేకూడినది. ఇంగ్లీషును అందరకును ఉమ్మడి భాషగాను, విద్యాబోధక భాషగాను ప్రవేశ పెట్టినందువలన, దేశమందంతటను పరిపాలనలో ఏకరీతి యేర్పడి, జనులలో

మానసికముగాను, రచనాదికములలోను తత్పూర్వము ఎన్నడునులేని యొక నూతన సామాన్య స్వభావము కలిగినది. దేశమందు సంస్కృతము దేశ భాషగా సార్వజనీనముగా నుండిన కాలములో కూడ ఇటువంటి సంఘీభావము ఎన్నడును ఉండినదికాదు. బ్రిటిషువారి పాశ్చాత్యపద్ధతులలో పెక్కు విశ్వ విద్యాలయములు స్థాపింపబడుట చేత ఒక నూతన విద్యా చైతన్యము కలిగినది; పాశ్చాత్యులతోడి సాంస్కృతికసహవాసమునకు దారి తీసినది. అది భారతీయుల యొక్క సాహిత్య శాస్త్రీయ దృక్పథమునే మార్చివేసినది, ముద్రణాలయములు ప్రవేశపెట్టబడినందువలన వాఙ్మయము, ఒక పొంగు పొంగినట్లు, తత్పూర్వము భోజరాజ కృష్ణరాయాదులవంటి భాషాపోషకుల వలన కూడ సాధ్యముకానంతటి పురోగమనమును పొందినది. కొన్ని శతాబ్దములుగా పండితులకు అలభ్యములైయుండిన అపూర్వ తాళపత్ర గ్రంథములు కనుగొనబడి జనులకు చాల తక్కువధరలకు దొరకసాగినవి. విద్యార్థులు ధనవ్యయ కాలహరణములకోర్చి, శ్రమపడి, తాముగానో ఇతరుల చేతనో, ఉద్గ్రంథములకు ప్రతులు వ్రాయించుకొనుచుండినవారు, ఆ బాధ లేకయే, సులభముగా పుస్తకములుకొని, తమ సొంత భాండాగారముల నిర్మించుకొనసాగిరి. జీవితములో ఒకపాటి నెమ్మది కుదిరి ప్రయాణములు, ఉత్తర ప్రత్యుత్తరములు సులువుగాను, త్వరగాను, భద్రముగాను జరుగుట కారంభించినవి. జనులలోని వివిధ వర్గములలో పరస్పరస్నేహ భావము కుదిరి, అన్ని సమస్యలును సౌమనస్యముతో కుదుర్చుకొనుటయు కుదిరి, వర్ణాశ్రమ జాతిమతముల నిర్బంధములు కట్టుబాట్లు తొలగిపోసాగినవి.

భారతీయభాషలలో కూడ, హిందూ దేశచరిత్రయు, తులనాత్మక భాషా తత్త్వశాస్త్రములు ఏర్పడి క్రొత్త దృక్పథమే కలిగినది. పాశ్చాత్య భాషా సాహిత్యముల పరిచయమువలన ప్రాచీన గ్రంథపఠన మార్గములలో క్రొత్త విధానమున మేలైన విమర్శకమార్గములుతోచి, భారతీయ వాఙ్మయములలో భావపుష్టి, వక్కణగా వ్రాయుటలో పొంకమును కుదిరినవి. విశ్వవిద్యాలయ ములలో సంస్కృతాంధ్రములను చదువుటకారంభమై, తరగతులవారీగా, వచనరచన పద్య నాటక పాఠ్యగ్రంథములును కావలసి వచ్చినవి. సంస్కృత ములో వలెనే తెలుగులోకూడ పద్యకావ్యముల బాహుళ్యమున్నంతగా, వచన వాఙ్మయము లేకపోవుట ఒక వింత. ఇందులకు కారణము, జనులకు వినుటలో నుండినంత శ్రద్ధ చదువుటలో లేకపోవుటయే. వచనములో కూడ ఒక ఆశ్చర్యమేమనగా, సామాన్యజనుల దైనందిన వ్యావహారిక వచనమునకును, వాఙ్మయములో కనబడు వచనమునకును సముద్రమంత వ్యత్యాసము కనబడుటయే. కావ్యములలోని వచనము దీర్ఘసమాసములతోనిండి, ప్రాసాను ప్రాసలతో, ఒక వాఙ్మయప్రక్రియగా పరిణమించి, చదువుకొనుటకు

పాడుటకును ఉపయోగపడుచుండి, ప్రాచీన ఫక్కిలోనుండి, కఠినమైపోయి నందువలన, మామూలు వ్యవహారములకు పనికిరాక, అభ్యాసపడినవారికి కూడ అర్థము కాక, పండితసహాయము పొందవలసి వచ్చెడిది. సంస్కృత నాటకముల వంటి నాటకములు తెలుగులో లేకపోవుట ఒకవెలితిగా కనబడు చున్నది. వీథినాటకములు, సంగీతకవిత్వ నాట్య సంభాషణల సమ్మేళనముగా, ఆరుబయళ్లలో, స్థిరనాటకమందిరాది సౌకర్యములు లేకయే, చదువుకొన్న వారికిమాత్రమేగాక, జనసామాన్యముయొక్క వినోదముకొఱకు ఆడుచుండిరి.

విశ్వవిద్యాలయముల స్థాపనతో క్రొత్త వాతావరణ మేర్పడినది. ఆంగ్ల తరగతులతో సమానముగా దేశభాషల తరగతుల పఠనమునకు, వైవిధ్యము తోడి పాఠ్యపుస్తకములు తయారు చేయవలసిన బాధ్యత ఉపాధ్యాయులకు ఏర్పడినది. దీని చేత, తరగతి వారీగా, శైలీ భేదములతో వచన గ్రంథములను నాటకములను వ్రాయవలసి వచ్చినది. పండితులు వచన పాఠ్య గ్రంథములను సంస్కృతనాటకాను వాదములను తయారు చేయుటయే గాక, ప్రాచీనకావ్యముల నుండి, విద్యార్థులకు కావ్య సంగ్రహములను కూడ సంపాదింపసాగిరి. ఇట్లు వచన వాఙ్మయ నాటక ప్రక్రియలు సిద్ధము సేయుటతో కూడ పండితులు, నవలలు, కథానికలు, మహాకావ్యములకు బదులు ఖండ కావ్యములు, విమర్శవ్యాసములను సైతము వ్రాయనారంభించిరి. అన్నిటికన్న ముఖ్యమైనది, పాశ్చాత్య విధానమున ప్రాచీన గ్రంథములను, పీఠికలతో, పేరాలుగా విడదీసి, వాక్యవిరామ చిహ్నములతో, చిన్న చిన్న శీర్షికలతో, విడదీసి పరిష్కరించి ముద్రించు పద్ధతి ఒక సొంపు కలిగించినది.

ఈ కాలమున వాఙ్మయదృక్పథమే చాల మారినది. అట్టి తరుణమున వేదము వేంకటరాయశాస్త్రి గారు ఈ నూతన వాఙ్మయ వికాసకారకులలో నొకరుగా చాల ప్రసిద్ధినందినారు.

## 2. శాస్త్రిగారి కుటుంబము - తల్లిదండ్రులు

ఆంధ్రదేశములో, నెల్లూరు జిల్లాలో, పుదూరు ద్రావిడ బ్రాహ్మణశాఖలో కౌశిక గోత్రమందు వేదమువారియింట శాస్త్రిగారు జన్మించినారు. ప్రాచీన పల్లవ చోళ చాళుక్య రాజుల కాలమునుండి విజయనగరరాజుల కాలమువరకు తమిళము మాటలాడు ద్రావిడ బ్రాహ్మణులు తెలుగు దేశమునకు వలసలు వచ్చి తమ వైదిక విద్యలకు మెచ్చుకొన్న రాజులనుండి అగ్రహారములు గ్రహించినారు. ఇట్టి వీరు ఆంధ్రదేశములో వ్యాపించి నేడు విశాఖపట్టణప్రాంతములో దిమిరి ద్రావిడులనియు, గోదావరి జిల్లాలో కోనసీమ, పేరూరు, ఆరామ ద్రావిడులనియు, నెల్లూరు జిల్లాలో తుమ్మగుంట, పుదూరు ద్రావిడులనియు, ప్రసిద్ధి హొందియున్నారు. తమ వైదిక విద్యలను, పారంపర్యమును కాపాడు కొనుచు వచ్చినను వీరిలో చివరివారు (పుదూరు) తప్ప మిగిలినవారు తమ తమిళభాషను మరచిపోయినారు. కాని అందఱును తెలుగు రచయితలలో అగ్రేసరులుగా నున్నారు. పుదూరుద్రావిడులు నేటికిని ఇండ్లలో తమిళము మాటలాడుచున్నారు. వైదిక సంప్రదాయమును వదలక ఆంధ్రవాఙ్మయాభివృద్ధికి తోడ్పడుచు, ఆంధ్ర ద్రావిడ కర్ణాటక దేశములలో వ్యాపించి యున్నారు. విజయనగరరాజుల కాలములో వీరిలో కొందఱు గొప్ప వేదాంతులు, కొందరు పరమ వైష్ణవులుగా నుండి శ్రీరామానుజ శ్రీభాష్యమును శిష్యులకు ప్రవచనము చేయుటకు అగ్రహారములు హొంది యున్నారు.

వేదము కుటుంబమువారిది ఆదిలో తిరుపతి. అచ్చటినుండి నెల్లూరు జిల్లాకు వలసవచ్చి, అచ్చటి ప్రభువులచేత, కావలి తాలుకాలో సముద్ర తీరమున, మల్లయపాళెము అను గ్రామమును అగ్రహారముగా హొంది, పెక్కు యజ్ఞములొనర్చినారు. వీరిలో వేంకటరమణశాస్త్రిగా రనువారు, 1817 ప్రాంతమున జనించి, బాల్యములోనే, తమకు దాదాపు 12 ఏండ్ల వయస్సున, మదరాసునుండి నలువదిమైళ్ళు, కంజీవరమునకు, నెల్లూరినుండి నడిచియేపోయి, శ్రీ నివర్తి వేంకటరామశాస్త్రిగా రనువారివద్ద, గురుకులవాసముండి, వేదాధ్యయనము చేసిరి. దాదాపు పది సంవత్సరము లచటనుండి విద్యాభ్యాసము పూర్తిచేసికొని, తమ గ్రామమునకు మరలివచ్చి, వివాహము చేసికొని, 1847 లో, మదరాసులో బేరిసెట్టు, ముత్యాలపేట, తంబుసెట్టి వీధిలో ప్రారంభించిన సంస్కృతాంధ్ర ద్రావిడ పాఠశాలకు ప్రధానోపాధ్యాయులైరి. మూడు భాషలలో పండితులైనందువలన, సంస్కృతాంధ్రద్రావిడములను బోధించుచుండిరి. వీరితోడి తెలుగు సాహిత్యాధ్యాపకులు, తర్వాత

శబ్దరత్నాకరాది నిఘంటు రచయితగా ప్రసిద్ధినందిన శ్రీమాన్ బ. సీతారామా చార్యులవారు. ఈ పాఠశాలయే తర్వాత, నేటి ముత్యాలపేట ఉన్నత పాఠశాలగా అభివృద్ధియైనది. తర్వాతి కాలమున వేంకటరాయశాస్త్రిగారు ఇచ్చట 1886 లో, అంగ్లభాష ప్రవేశ పెట్టబడినప్పుడు ప్రధానోపాధ్యాయులైరి. వేంకటరమణశాస్త్రిగారికి ఆంధ్ర వ్యాకరణవేత్త శ్రీపరవస్తు చిన్నయసూరి గారు సమకాలికులును మిత్రులును.

వేంకటరమణశాస్త్రిగారికి నలుగురు కుమారులును నలుగురు కుమార్తె లును జన్మించిరి. వీరిలో వేంకటరాయశాస్త్రిగారు పెద్ద కుమారుడు, తండ్రి గారు మద్రాసులో నుండగా, ప్రమాదీచనామ సంవత్సర, మార్గశిర, బహుళషష్ఠి, బుధవారము, (1853, సం॥ డిసంబరు 21 వ తారీఖున) జనించిరి. తండ్రిగారు వీరికి తమ తాత పేరు వేంకటరాయశాస్త్రియని నామ కరణము చేసిరి. వేంకటరమణ, వేంకటరాయయని ఈ పేర్లు ఈ కుటుంబ ములో మారి మారి వచ్చుచున్నవి. రెండవ కుమారుడు వెంకటసుబ్బయ్య. ఇరువదియైదేండ్లుండి, నాటి F. A. (తర్వాత ఇంటర్మీడియేటు) పరీక్షలో ఉత్తీర్ణులై, అకస్మికముగా మరణించిరి. మూడవవారు నెల్లూరిలో న్యాయ వాదిగా (B.A., B.L.) సుప్రసిద్ధులై, అరువది యేడేండ్లుండి గతించిన శ్రీ వెంకటాచల అయ్యరుగారు, గొప్ప విద్వాంసులు చరిత్రకారులునుగా ప్రసిద్ధులు రాజమహేంద్రవరములో విద్యాభ్యాసము చేసి, బి.ఏ. లో అత్యుత్తములుగా నుత్తీర్ణులై సంస్కృతమున గోడేగజపతివారి రూ 400, బహుమతిని పొందినారు. నెల్లూరిలో న్యాయవాది వృత్తిని ప్రారంభించి విశ్రాంతివేళలలో వేదములను గూర్చిన చారిత్రక పరిశోధనలలో కృషిచేసిరి. వీరు 1922 లో ప్రకటించిన A Study of the Preliminary Chapters of the Mahabharata అను గ్రంథము, జర్మనీదేశపు పండితుడైన వింట ర్నిట్జుచేత, అతని సంస్కృత వాఙ్మయ చరిత్రలో, బహుళముగా V. V. Iyer అని ఉదాహరింపబడినది. పూనాలోని సూక్తంకర్ పండితుడును తన సం శోధిత మహాభారత ముద్రణ కార్యమునకు ఉపయోగపరచుకొనెను. అయ్యరు గారి పౌరాణిక సప్తద్వీపముల మీాది వ్యాసము (The Seven Dvipas of the Puranas) లండన్ భౌగోళిక సంఘము (London Geographical Society) వారిచేత అద్భుతమైనది. 'ఆర్యావర్త', 'భరతవర్ష', 'మూడువేల యేండ్ల క్రింద నుండిన తమిళులు' మొదలైన వ్యాసములు, ఆర్యులయు, ద్రావిడులయు పుట్టు పూర్వోత్తరములను గూర్చినవి, మైసూరు Mythic Society వారి పత్రికలలో ప్రకటింపబడినవి. వీరు 1931 లో గతించిరి.

పెద్దల అగ్రహారము పురుషాంతరముల కాలక్రమమున విభక్తమైపోయి నందువలన తమకేదియు విశేషముగా మిగులక పోయినందువలన, తమ

కుటుంబ భరణార్ధము వేంకటరమణశాస్త్రిగారు జీవితాంతము ఉద్యోగము మీదనే ఆధారపడవలసిన వారైరి. 1856 వ సం వఱకు మదరాసులోనే యుండి ఉద్యోగముచేసి, తర్వాత ఆంధ్రదేశములో, సంస్కృత పండితులుగా ప్రభుత్వమువారి పాఠశాలలలోను, కళాశాలలలోను ఎక్కువగా విశాఖ పట్టణము గోదావరి జిల్లాలలో పనిచేసి, చివర రాజమండ్రి ఆర్ట్సుకాలేజిలో సంస్కృత ప్రధాన పండితులుగానుండి రు. 25/- పింఛనుమీద విరామము పొందిరి. ఆంగ్లభాషతో పరిచయము బొత్తిగా లేకపోయినను వేంకటరమణ శాస్త్రిగారు, ఎంతో మనోవికాసము నందిన వేదాంతి. కొరాను, బైబిలు, మున్నగువానిని పఠించు సంఘములతో కలిసి వాని పఠనమున ఆసక్తి చూపి, తమ విశాలభావములను ప్రకటించెడువారు. చిన్నయసూరి బాలవ్యాకరణ మునకు ముందే, తెలుగులో లఘువ్యాకరణమని యొక యాంధ్ర వ్యాకరణ మును వ్రాసియుండిరి. అది ఆ కాలపు పాఠశాలలలో పాఠ్యముగా నుండెడిది. ఆత్మబోధవివరణమని శ్రీశంకరాచార్యులవారి యాత్మబోధకొక చక్కని టీకను వ్రాసి ప్రకటించిరి. వీరికి వివాదములలో ప్రవేశించుటకు, శాంతస్వభా వులుగాన, ఇష్టముండెడిదిగాదు. అందుచేతనే, రాజమహేంద్రవరమున నుండిన కాలమున, కందుకూరి వీరేశలింగము పంతులవారి వితంతు వివాహ వాదములను ఎదుర్కొనవలసినదని ఆస్తికులు, పూర్వాచార పరాయణులు కోరగా వీరు నిరాకరించిరి. అందులకు వీరొక సులభమైన సమాధానమిచ్చిరి. పంతులవారి ప్రచార మాత్రమున హిందూధర్మము చెడిపో దనియు, ప్రతివానికిని తాను విశ్వసించినదానిని ప్రచారము చేయునధికారము, స్వాతంత్ర్యము కలదనియు తెల్పి, పైగా, తాము, వీరేశలింగమువంటి యువకుల ప్రచారమునకు ప్రాధాన్యమిచ్చి, ఎదురు ప్రచారము చేయుటకు చాల పెద్దవారమనియు, వివాదమునకు వయసులో సమానస్కంధత కావలెననియు తమ యభిప్రాయమును తెల్పిరి. కాని వారి కుమారులు వేంకటరాయశాస్త్రిగారు, వీరేశలింగముగారితో ఇంచుమించు సమ వయస్కులు, సనాతనుల పక్షమును అవలంబించిరి. ఈ విషయము ముమ్ముందురాగలదు. వెంకటరమణశాస్త్రిగారు చక్కని ఇంగితజ్ఞానముతో, ఎట్టి విషమపరిస్థితిలోను అధైర్యపడక, కీర్తి ప్రతిష్ఠలు గాంచి, వైయాకరణ పతంజలి యని బిరుదునంది, ఎనుబది మూడేండ్లు ఒడుదొడుకులులేని దీర్ఘజీవితము గడిపి, చివరకు మంచి యారోగ్యమునందుండి, నెల్లూరిలో ఒక సాయంకాలము అనాయాసముగా కన్నుమూసిరి.

# 3. విద్యాభ్యాసము – జీవిత ప్రారంభదశ

మహాపురుషులకు వారి బాల్యజీవిత విద్యాభ్యాసాది వాతావరణము వారి జీవితములో తర్వాతి మానసిక పరిణామమునకు కారణములనుట శ్రీశాస్త్రి గారి విషయములో సార్థకమైనది. 1853 వ సం॥ తండ్రిగారు మదరాసులో ఉద్యోగములో నుండుకాలమున జనించి, ఉద్యోగరీతిలో తండ్రిగారు ఆంధ్ర దేశములో పలుతావులనుండిన చోటులలో కూడ వసించినందువలన బాల్యము లోనే దేశములోని పెక్కు మండలములను చక్కగా చూచి అవగాహన చేసికొనుట కవకాశము దొరకినది. కాకినాడ, నరసాపురము, పోడూరు, విశాఖపట్టణము మొదలైన ప్రదేశములలోనుండి తుదకు రాజమహేంద్ర వరములో వీరి కుటుంబము గడపినది. చక్కని పరిశీలక దృష్టి, మంచి జ్ఞాపక శక్తి, మానవ స్వభావమును అనేక విషయములను అక్కఱతో పరిశీలించి తెలిసికొను జిజ్ఞాస, మానవుల దైనందిన జీవితమును వారి భాషలను గ్రహించు నేర్పు. అన్నిటినిమించి ఇంటిలో నిరంతరము ఒక అనుభవశాలియైన పండితునితోడి సాహచర్యము, వీనిచేత వేంకటరాయశాస్త్రి గారికి ఇంటిలోను బడిలోను బహుముఖ విద్యాభ్యాసమునకు మంచి అవకాశము దొరకినది. చక్కని పదమో వచనమో వారి హృదయమును ఆకర్షించెడిది. జీవిత సందర్భములును ఉదంతములును తర్వాతి రచనలకు స్ఫోరకములైనవి. ఎనిమిదేండ్లబాలుడుగా నుండగా తండ్రిగారు ప్రతాపరుద్రుని చరిత్రను ఎవరికో చెప్పుచుండగా తానును కూడ వినుట తటస్థించినది. ఈ కథయే తర్వాత వారి ప్రతాపరుద్రీయ మహానాటకమునకు ఆధారమైనది. ఒక మారు బాల్యములో, తమ తమ్ముడు వెంకటసుబ్బయ్యతో కలిసి భయంకరమైన గోదావరిలో, ఈ గట్టునుండి ఆ గట్టువరకు, ఈదబోయి, ప్రమాదమును దైవవశాత్తుగా, ఎవరో పడవవాండ్ర సాయముతో తప్పించుకొనిన ఉదంతమును మనస్సులో ఉంచుకొని, ప్రతాపరుద్రీయ నాటకములో ఒక సన్నివేశమునకు ఉపయోగపరచుకొనిరి. ప్రతాపరుద్ర మహారాజును మహమ్మదీయులు పడవలలో గోదావరిని దాటించుచుండగా చూచి, చక్కని ఈతగాడైన విద్యానాథుడు, గోదావరిలో దుమికి పడవలకడకు మొసళ్లను తప్పించుకొని ఈదుచు పోయిన ఘట్టమంతయు తమ్మునితో కలిసిచేసిన బాల్యవినోదచర్యానుభవ జ్ఞాపకమే. తమ్ముడు వెంకటసుబ్బయ్య ఆనాటి ఈతగాండ్రలో విద్యార్థులలో మేటిగా ప్రసిద్ధుడట. పేరయ్య, చెకుముకిశాస్త్రి మొదలైన పాత్రలు కూడ వారు జీవితములో చూచిన వ్యక్తులపేళ్లను, విశేష

వర్ణనములును. అందరితోను కలసిమెలసి తిరుగుచు, చదువునప్పుడుగాని, ఆడుకొనునప్పుడుగాని, ఎంతో పరిశీలించుచు చాల లోకజ్ఞానమును సంపాదించిరి. ముష్టివాండ్రు, బుఱ్ఱకథలవారు మున్నగువారి పాటలు బాల్యమందే వారి హృదయమున నాటుకొని జానపద వాఙ్మయము మీద వారికి వీడరాని అభిరుచికి కారకములైనవి.

వేంకటరాయశాస్త్రిగారికి తండ్రిగారి వద్ద కూర్చుండి సమ్ముఖమున చదువుకొనుట కుదురలేదు. తండ్రిగారియొద్ద నేర్చిన దంతయు, ఆ మహాపండితుడు తన శిష్యులకు బోధించునప్పుడును, స్నేహితులతో మాటలాడుచుండినప్పుడును వినుచుండినదే. వేంకటరమణశాస్త్రిగారు అతి కఠిన శిక్షకులు. బెత్తమును మాని ఎఱుగరు. వారి పరిహాస వాక్యములు వారి కుమారులకుకూడ వెగటు పుట్టించి వారిని తప్పించుకొని తిరుగునట్లు చేసినవి. కాని తండ్రిగారు తమ చుట్టును నిర్మించిన వాఙ్మయ వాతావరణము, లేతవయసునందే, సృజనాత్మక హృదయముగల ఆ కుమారునియందు వాఙ్మయాభిరుచిని రేకెత్తించినది. పాఠశాలా విద్యాభ్యాసానంతరము, కుమారులు, తమ చిన్ననాటి పొరపాటునకు చింతించి, తండ్రిగారిని తమకు సంస్కృతము బోధించి సన్మార్గము చూపవలసినదిగా ప్రార్థింపగా, పెద్దవారు కోపగించి, కుమారులు తమకు చాల ఆశాభంగము గావించినారని, వారి యభ్యర్థనను తిరస్కరించి, వారిని వారి ప్రాప్తమునకు వదలివేసిరట. వేంకటరాయశాస్త్రిగారికి కోపము రేగి, పుస్తకములు పెట్టుకొని, సంస్కృతమును బిగ్గరగా తండ్రిగారికి వినబడునట్లు, తమ తప్పులున్న అది వారికి బాగుగా వినబడునట్లును, అవి వారు కోపము వచ్చి దిద్దవలెననియు, చదివెడివారట. కుమారుల దృఢసంకల్పమునకు లోలోపల సంతోషించుచు, తండ్రిగారు తప్పులు వచ్చిన దిద్దుచు, తెరమఱుగు విద్యాభ్యాసముగా బోధించి, స్వయంకృషిచేతనే తమ కుమారులయొక్క భవిష్యత్పాండిత్యమునకు పునాదులు వేసిరట.

శాస్త్రిగారి జీవితమంతయు స్వయంశిక్షయు ఉద్యోగమునుగా గడచినది. కుటుంబము పెరుగుచుండి, మఱియొకరు సంపాదింపవలసివచ్చుటచేత, విశాఖపట్టణములోని నార్మలుస్కూలునుండి 1869 లో మెట్రిక్యులేషను ప్రథమశ్రేణిలో నుత్తీర్ణులైన వెనువెంటనే, ఉపాధ్యాయవృత్తి నవలంబింపవలసినవారైరి. అప్పుడు వీరి పేరు వెంకట్రాయుడు. ఉపాధ్యాయుడుగా శిక్షణ పొందుటకు (ట్రెయినింగు) వారు మదరాసుకు వచ్చి, ఇచ్చట నార్మలు స్కూలులో చేరవలసియుండెను, ఇచ్చట, వారి ఉపాధ్యాయులలో ప్రధానులు, తర్వాత సుప్రసిద్ధులైన శ్రీమాన్ బహుజనపల్లి సీతారామాచార్యులవారును బ్రహ్మశ్రీ చదలువాడ సీతారామశాస్త్రిగారును, 1875 లో F.A. పరీక్షలో

నుత్తీర్ణులైరి. కాని ఏయుద్యోగమును దొరకలేదు. కారణము రాజమండ్రి ఆర్ట్సుకాలేజి ప్రిన్సిపాలుగారికి వీరిమీద ప్రీతిలేదు. వారి జీవితములోని శ్రమలకును పోరాటములకును ఇదే ప్రారంభము. తమ సామర్ధ్యమునకు తగిన ప్రతిఫలము వారెన్నడును పొందలేదు. ఎన్నియో విన్నపముల మీద ప్రార్ధింపగా శ్రీకాకుళము ఉన్నత పాఠశాలలో ఒక చిన్న యుపాధ్యాయుని స్థానమున, చాల కొద్ది జీతముమీద, నియమింపబడినారు. అధికారులు, వారికి న్యాయము చేకూర్చుటకు బదులు వారి యధార్ధవాదిత్వమునకు శిక్షగా ఇచ్చిన ఉద్యోగమిది. తర్వాత చోడవరములో, తాలూకా లోయర్ సెకండరీ పాఠశాలకు ప్రధానోపాధ్యాయుడుగా నియమింపబడిరి. ఈ స్థలమును ఒక ముఖ్యమైన విషయముకొఱకు జ్ఞాపకముంచుకొనవలసి యున్నది. అది ఇది. అచ్చట ప్యూను పేరు పేరిగాడు. (ఇది ప్రతాపరుద్రీయ నాటకమందొక ప్రధాన పాత్రయొక్క పేరు.) వాడు ఆ పాఠశాలయొక్క సెక్రిటరీగారికి ఆప్తుడు, పొగరుగలవాడు. ఆ ప్యూనును చక్కబఱుచుకొనుటకు అధికారులతో సంఘర్షణ పడి కఠినచర్య పుచ్చుకొన్నగాని సాధ్యపడుకుండెను. అంతవిషమపరిస్థితి, అటు తర్వాత వెంకటరాయడుగారు విశాఖపట్టణము హిందూ హైస్కూలులో ప్రధాన సహాయోపాధ్యాయుడుగాను, అటు వెనుక రాజమండ్రి టౌను స్కూలుకు ప్రధానోపాధ్యాయుడుగాను, నియమింపబడిరి. ఈయుద్యోగములో చక్కని బోధకుడనియు, విద్యార్థి క్రమ శిక్షణాపరుడనియు మంచిపేరు సంపాదించిరి.

1879 సం॥ ఆగస్టు 3 వ తేది, వీరు రాజమహేంద్రవరమున నుండగా వీరేశలింగముపంతులుగారు సంఘసంస్కరణమును గూర్చియు, వితంతు వివాహములు చేయువచ్చుననియు తమ ప్రధమోపన్యాసము నిచ్చిరి. ఆ యూరి పాఠశాలా ప్రధానోపాధ్యాయులగుటచేతను, కొంత పాండిత్య ప్రకర్షల చేతను వెంకటరాయడన్న పేరు వేంకటరాయశాస్త్రిగా మారినది. వీరి తండ్రి గారు వీరేశలింగముగారి వాదమునకు ప్రాధాన్యమీయక, అదేదో అత్యల్ప విషయమని ఉపేక్షించినందువలన, సనాతనులకొఱకు, వేంకటరాయశాస్త్రి గారు రంగమున ప్రవేశించి ఎదుర్కొనసాగిరి. సంస్కృత ప్రమాణ గ్రంథములనుండి విశేషముగా ఉదాహరణము లిచ్చుచు, వితంతు వివాహములకు శాస్త్రీయసమ్మతి బొత్తిగా లేదని, వీరేశలింగముగారి ఉపపత్తులనన్నిటిని ఖండించిరి.

తర్వాత కొంతకాలమునకు వారికి బి. ఏ. పట్టము పొందవలెనను అభిలాష కలిగినది. ఈ ఉద్యమ ప్రచారాదులు చదువులకు భంగకరమని తలచి, తనయుద్యోగములో, తమ్ముని, వెంకటసుబ్బయ్యను, అతడును చక్కని పండితుడై F. A. ప్యాసైయుండినందువలన, రాజమండ్రి టౌను స్కూలు

ప్రధానోపాధ్యాయుడుగా, తనకు బదులుంచి, మదరాసుకు వచ్చిరి. అంతకు కొంతకాలము ముందే ఈ సోదరుల కిరువురకు వివాహములైయుండినవి. అది వారి జీవితదశలలో నూతన పరిణామకాలము. జీవితము ఎప్పుడును సుఖముగా నుండదు. సోదరు లిరువురును అంతవఱకు ఎడబాయని వారు, ఇప్పుడు ఎడబాయవలసి వచ్చినది. కాని అది తుది ఎడబాటు. మఱి వారిరువురు కలసికోలేదు. మదరాసుకు వచ్చిన వేంకటరాయశాస్త్రిగారికి అనేక కారణములచేత చదువు జరుగలేదు. త్వరలోనే, తమ భార్య, పుట్టింట, గ్రామములో, మశూచిక వ్యాధి చేత, మరణించినట్లు వార్త వచ్చినది. దాని వెనువెంటనే తన ప్రియసోదరుని ఆకస్మిక మరణవార్త వచ్చిపడినది. ఇదంతయు వారికి పిడుగువంటి దెబ్బ. జీవితములో ప్రథమానుభవము. తమ డెబ్బదియవ సంవత్సరములో సైతము, ఆ తమ్ముని తలంచుకొని వారు కన్నీరు నించిన సందర్భములు నేను ప్రత్యక్షముగా చూచియున్నాను. తనకెంతో ఆప్తుడైన సోదరుడు, తన అన్న బి.ఎ. పట్టమును ఇంకను పొందలేదు కాబట్టి, తనకు చదువుకొను సామర్థ్యమున్నను, బి. ఏ. పరీక్షకు కూర్చుండ నిరాకరించిన అభిమాని, కూడవసించి ఆడుకొని, చదువుకొని, శరీరములు వేరేగాని హృదయములు ఒకటే అని తలంచునంతటి అన్యోన్యముగా నుండినవాడు, తనతో గోదావరీ ప్రమాదకాలమున కూడ నుండి కాపాడినవాడు – అట్టి సోదరుడు - పోవుట పెద్ద మానసిక వ్యాఘాతము.

అటు తర్వాత, త్వరలోనే, వేంకటరాయశాస్త్రి గారికి, మదరాసు ముత్యాల పేట ఆంగ్లో వర్నాక్యులర్ స్కూలులో ప్రధానోపాధ్యాయ పదవి దొరికినది. ఈ స్కూలు పూర్వము సంస్కృతాంధ్ర ద్రావిడ పాఠశాలగా నుండి, ఆంగ్ల భాష ప్రవేశ పెట్టబడి, ఈ క్రొత్త పేరు వహించినది. తర్వాత ద్వితీయ వివాహము చేసికొనిరి. వీరిపత్ని, నెల్లూరు జిల్లా, నాయుడుపేటకు సమీపమందలి చిల్లమూరు గ్రామస్థులైన అల్లాడి సదాశివశాస్త్రిగారి కుమార్తె శేషమ్మగారు. కుటుంబము నెలకొన్నది. నెలకు నలువదిరూప్యములు జీతము. సంస్కృత వాఙ్మయ శాస్త్ర గ్రంథముల మీాద జీతములో చాల భాగము వెచ్చించి చదువసాగిరి.

మదరాసుకు వచ్చియు వితంతు వివాహ వాదములు వీరిని వదలలేదు. మదరాసులోని పూర్వాచారపరాయణులైన వారును, సనాతన హిందూ సంఘములును వీరిని ఇక్కడ కూడ ఉపన్యసింపవలసినదిగా కోరసాగిరి. దీనికి కారణము వెదుకనక్కఱలేదు. వీరేశలింగము పంతులుగారు మదరాసు ప్రెసిడెన్సీ కాలేజికి ఆంధ్రపండితులుగా వచ్చి ఇచ్చట మరల ప్రచారము ప్రారంభించుటయే. ధర్మశాస్త్ర విషయముల మీాద శాస్త్రిగారి యుపన్యాస

ములను, జనులు నలుమూలల నుండియు వచ్చి, శ్రద్ధతో వినుచుండిరి. దక్షిణ దేశము నుండి మఠములు, ఆస్తిక సంస్థలు, తమ ప్రతినిధులను పంపి పాల్గొనుచుండినవి. 1883 లో, తమ యుపన్యాసముల నన్నిటిని కలిపి ఒక గ్రంథరూపముగా, స్త్రీ పునర్వివాహ దుర్వాదనిర్వాపణ మను పేరిట, ప్రజల ధనసాయముతో ప్రకటించి వేయి ప్రతులు ఉచితముగా పంచి పెట్టిరి.

## 4. మదరాసు క్రైస్తవ కళాశాలలో సంస్కృత ప్రధాన పండిత పదవి

త్వరలోనే మదరాసులో VVS (అని శాస్త్రిగారి పేరు) సంస్కృతమునకు లోకోక్తిగా నేర్పడెను. మదరాసు క్రైస్తవ కళాశాలవారు 1886 లో వారిని ఆహ్వానించి, రు. 45-00 ల వేతనము మీద తమ కళాశాలా సంస్కృత పండిత పదవిని వారి కొసగిరి. అంతవఱకు వారు ముత్యాలపేట ఆంగ్లో వర్నాక్యులర్ స్కూలుకు ప్రధానోపాధ్యాయులుగా నుండి రు. 40-00 లు జీతము పుచ్చుకొనుచుండిరి. అప్పుడే ఏదో మర్యాదలోపకారణముగా, ఆ యుద్యోగమునకు రాజీనామా యిచ్చి, రాజమండ్రికి పోయి అచ్చట నొక యుపాధ్యాయోద్యోగమును సంపాదించుకొనదలంచియుండిరి. ఇది యొక శుక్రవారము సాయంత్రము జరిగినది. ఈ విషయము క్రైస్తవ కళాశాల యొక్క డా॥ మిల్లరుగారికి తెలిసి, వారు వెంటనే, అతిత్వరగా, వేంకటరాయశాస్త్రిగారిని పిలిపించి, ఎక్కువ జీతమిచ్చి, తమ యుద్యోగమును స్వీకరింప ప్రార్థించిరి. శాస్త్రిగారికి జీతము యొక్క హెడిగింపుకంటె సంస్కృతవిద్యోపాధ్యాయత్వము ఎక్కువ ఆకర్షకముగాను ఆనందకరముగా నుండినది. కళాశాలవారికి, తమ కళాశాలకు విభిన్న భాషలవారు జాతులవారును వచ్చుచుండినందువలన, సంస్కృతమును, ఆంగ్లభాషా సహాయమున బోధించువారు కావలసియుండిరి. ఆ కాలమున (1886) నెల్లూరివారైన శ్రీ ఒంగోలు వేంకటరంగయ్యగారు ఆ కళాశాలలో సంస్కృత విద్యార్థి. వీరు తర్వాత నాతో చెప్పియున్నారు. విద్యార్థులు తాతగారి (వేంకటరాయ శాస్త్రిగారి) సంస్కృత పాండిత్యమునకును, ఇంగ్లీషు మూలముగా బోధించు

నేర్పునకును చాల హర్షించిరట. అటు వెనుక, త్వరలోనే, సంస్కృత విద్యార్థుల సంఖ్య ఆయా తరగతులలో రెండింతలై, వీరికి సహాయకుడుగా మఱియొక పండితుడు కూడ నియమింపబడెను. మైసూరు కాంతరాజ అరసువంటి రాజకుటుంబములకు చెందినవారు కూడ, కళాశాలలో ప్రవేశించి శాస్త్రిగారికి శిష్యులు కాసాగిరి. పురీశంకరాచార్య స్వామివారు, భారతీకృష్ణ తీర్థులు, పూర్వాశ్రమములో వెంకటరమణసరస్వతి యని ప్రసిద్ధులు, తాతగారి యభిమాన శిష్యులై, తర్వాత చాలకాలమువఱకు, తమ సంస్కృతాచార్యుల సాంగత్యమును వీడకయుండిరి. ప్రముఖ రాజకీయవేత్త ఎస్. సత్యమూర్తిగారు, డాక్టరు అల్లాడి కృష్ణస్వామి అయ్యరుగారు, శ్రీ ఏ. వి. రామనాథన్‌గారు (మైసూరులోను భరత్‌పూరులోను దివానుగానుండినవారు), ఆచార్య నీలకంఠశాస్త్రిగారు, ఇంకనెందఱో తాము వేంకటరాయశాస్త్రిగారి విద్యార్థులమని సగర్వముగా చెప్పుకొనియున్నారు. శ్రీ ఏ. వి. రామనాథన్ గారు, 1938 సం॥ మదరాసు క్రైస్తవ కళాశాల పూర్వవిద్యార్థి సంఘము యొక్క సమావేశమున మాటలాడుచు ఇట్లు చెప్పిరి, —

"ఆంధ్రాభిమాని, పండితుడు, వేదము వేంకటరాయశాస్త్రి గొప్ప పండితుడును, బోధకనిపుణుడును మాత్రమేగాక, విద్యార్థులందరికిని మంచి స్నేహితుడును గురువునుగా నుండెను. మా (విద్యార్థుల) లో సంస్కృతాభిమానమును రేకెత్తించుటయేగాక, మన ప్రాచీన సాహిత్య సౌందర్య గాంభీర్యములను మేము గ్రహించి ఆనందించునట్లు చేసినారు."

శాస్త్రిగారి ఆంగ్లభాషా పాండిత్యము ఎట్టిదనగా, ఒకప్పుడు డా॥ అల్లాడి కృష్ణస్వామిగారును వారితోడి విద్యార్థులును, శాస్త్రిగారు తరగతిలో ముద్రారాక్షసమును పాఠము చెప్పుచుండగా, వారిచేతిలోనిది ఎవరో ఆంగ్లేయుని అనువాదముగా నుండుననియు, దానినుండియే ఆంగ్లేయానువాదమును వారు చదువుచున్నారనియు, వారు సంస్కృత పండితులుగాన సంస్కృతభాగము వారికి గ్రుడ్డి పాఠముగా నోటికి వచ్చినదేగాన, దానికి వారికి పుస్తక మక్కరలేదనియు, వివాదపడిరట. ఇట్లు, కుతూహలము అధికముకాగా, గంటకాగానే వారు శాస్త్రిగారిని సమీపించి ఆ పుస్తకమును చూడగా, అది ముద్రారాక్షస సంస్కృతమూలమేగాని, ఆంగ్లానువాదము గాదు. శాస్త్రిగారి ఆంగ్లానువాదమంతయు వారి సొంతమే.

ఈ యుదంతమును కొన్ని సంవత్సరములకు మునుపు శ్రీ అల్లాడి కృష్ణస్వామిగారే నాకు తెలిపినారు. నెల్లూరు వర్ధమాన సమాజమువారు 1938లో చేసిన యొక 'వేంకటరాయశాస్త్రి వార్షికోత్సవము' లో నొకదానికి అధ్యక్షులుగా పైయభిప్రాయమునే మనసులోనుంచుకొనికాబోలు ఇట్లు చెప్పిరి — 'వారు ముద్రారాక్షసమువంటి సంస్కృత నాటకములను

బాలవడిగా, సునాయాసముగా, అమిత సులభముగా ఆంగ్లభాషకు తర్జుమా చేసి చెప్పుట ఎట్లుండినదనగా, వారేదో ఇంగ్లీషు పుస్తకమునుండి చదువుచున్నట్లుండెడిది. వారి వివరణము అద్భుతము. తమ పాండిత్యము చేత ఎన్నో విషయములు విశదీకరించుచు వ్యాఖ్యానావసరమున వారు చూపెడి ఉదాహరణములు, దృష్టాంతములు, ఉపమానములు వినువారికి మరపునకురాని విషయపరిజ్ఞానమును కలిగించును. వారి బోధన విధానము ఎంతటి ఉత్తమమైనదనగా, వారి విద్యార్థులు, అటు తర్వాత, తాముగా ఎట్టి శ్రమయు పడనక్కఱలేకుండెను.' (హిందూ పత్రిక 24-12-1938).

కొన్ని సంవత్సరములు శాస్త్రిగారు హైందవ తత్త్వశాస్త్రమును బోధించుచుండిరి. అప్పుడప్పుడు బైబిలు కూడ పాఠము చెప్పెడివారు. క్రీ. శ. 1910 లో సంస్కృత ప్రధాన పండిత పదవి, ఉపభాషా విచారణాధికారి (Superintendent of Vernacular Studies) పదవులనుండి విరామము హొందిరి. కళాశాలవారు, వారిని ఇంకను ఉద్యోగములోనే యుండవలెనని కోరుచుండినను, వారు అప్పటికి కొన్ని నెలల క్రింద, తామొక ముద్రాక్షర శాలను ప్రారంభించి యుండినందువలన, ఆ కోరిక నంగీకరింపలేదు. సంస్కృతాంధ్ర గ్రంథములను తాము విరామము హొందిన తర్వాత ముద్రించుటకు ముద్రాక్షరశాలను స్థాపించుట వారి జీవితములో ఇది రెండవ పర్యాయమును. ఇంక కొన్నిసంవత్సరములకు ముందే విరామము హొంది యుందురుగాని 1906 వ సం॥ ఆర్బత్‌నట్ బ్యాంకి మునిగిపోయినందు వలన, అందులో వారు చేర్చిపెట్టుకొని యుండిన మొత్తము, మూడువేల రూప్యములు, పూర్తిగా మునిగిపోయినది. కళాశాలలోనుండిన కాలము లోను, విరమించిన తర్వాతను, విశ్వవిద్యాలయముయొక్క పెక్కు 'కమిటీ' లలో సంస్కృతము, తెలుగు, ఫిలాసఫీ (తత్త్వశాస్త్రము) మున్నగువాని 'Boards of Studies' లో సభ్యులుగాను, పరీక్షాధికారిగాను నుండిరి. తెలుగుభాషను దాని స్వచ్ఛత నుండి దిగజార్చు ప్రయత్నములు దేశములో ఎన్నియుండినను, దేశమున కంతటికిని ఉమ్మడిగా నొక ప్రామాణిక (standard) భాష ఉండవలెనని సలహానిచ్చిరి. కొంత సడలించినను మదరాసు విశ్వవిద్యాలయము ఇంతవఱకును ఈ సలహానే పాటించు చున్నది. బి.ఏ., ఇంటర్మీడియేటు తరగతులకు కావలసిన పాఠ్యభాగములు సంగ్రహించి, తయారుచేసి, ప్రాచ్యభాషా పరీక్షల ప్రణాళికలను గూడ సిద్ధపఱచిరి. వీరు ఒక సంవత్సరము తమిళమునకు గూడ పరీక్షాధికారిగా నుండిరని తెలిసికొనుట కొంత వేడుకగానుండును. దానిమీద శ్రద్ధ లేనందున, ఒక సంవత్సరముతో దానిని మానుకొని, సంస్కృతాంధ్రములనే వరించిరి. వారు తమ బి. ఏ. పరీక్ష పూర్తిచేయలేక పోవుటయు వింతయే.

1887లో తొలి పర్యాయము పరీక్షకుపోయి, కొన్ని భాగములలో నుత్తీర్ణులై, తర్వాతిభాగములకు అవకాశము లేక, పూర్తిచేసికొనకయే వదలిరి.

క్రైస్తవ కళాశాల సంస్కృతపండితులుగా వీరికి ఎందరో సంస్కృత పండితులతో సాహచర్యము కలిగినది. అందులో మదరాసు ప్రెసిడెన్సీ కళాశాల సంస్కృతాచార్యులు T. M. శేషగిరి శాస్త్రిగారు, మదరాసు ప్రాచ్యలిఖిత గ్రంథభాండాగారాధికారి (Curator of the OMSS Library) వంటివారు పెక్కురు. (వీరును పుదూరుద్రావిడులే. తమిళదేశమునకు పోయిన కుటుంబములవారు. ఈ రచయితకు తర్వాత మాతామహులు.

## 5. తొలిరచనలు

వేంకటరాయశాస్త్రిగారి వాఙ్మయజీవితము వారి మదరాసు ప్రవేశము తోనే ప్రారంభమైనది. అప్పటికి రాజమండ్రిలో వీరేశలింగముగారి ప్రతిస్పర్ధిగా వీరికి పేరేర్పడియుండినది. పంతులవారి మదరాసు రాకతో వివాదములు మరల ప్రారంభమైనవి. ఈ విషయము ముందరి ప్రకరణములో ప్రస్తావింపబడినది. 1883 వ సం॥ మదరాసు, ముత్యాలపేట ఆంగ్లో వర్నాక్యులరు స్కూలు ప్రధానోపాధ్యాయులైన కొంత కాలమునకే మదరాసు క్రిశ్చియన్ లిటరేచర్‌సొసైటీవారి పత్రిక, 'జనవినోదిని ' కి సంపాదకత్వమును, తమ యుపాధ్యాయులు శ్రీ చదలువాడ సీతారామ శాస్త్రిగారి యొద్దనుండి తాము పుచ్చుకొనిరి. అదియొక మాసపత్రిక, సులభ వచనములో కథలు, చారిత్రక భౌగోళిక విషయములు కళాశాలా పాఠశాలా విద్యార్థులకొఱకు మూడు నాలుగు దాక్షిణాత్య భాషలలో వెలువడు చుండెడిది. ప్రతాపరుద్రుని కథ, తర్వాత నాటకముగా తాము వ్రాసినది, వేంకటరాయశాస్త్రిగారు 1883 లో ఇందులో ప్రకటించిరి.

శాస్త్రిగారు తమ జీవితములో చేర్చిపెట్టుకొన్న ద్రవ్యముతో అధునాతన ప్రచురణములను కూడ కొని, చక్కని భాండాగారమును తయారు చేసికొని యుండిరి. ప్రతిదినము పదునెనిమిది గంటలు పనిచేయుచు, పెక్కు విధములలో చాల చురుకుగానుండిరి. ప్రతిదినము చాల చీకటితో లేచి, కథా సరిత్సాగరమునుండి ఐదారు పుటలు, చాలవడిగా, సూర్యోదయమునకు చాల

ముందే అనువదించెడివారు. ఇది ఎట్లు చేసెడివారనగా, ఎవరినో స్నేహితుల నౌకరిని మూలమును చదువుటకు నియమించి, వారు చదువుచుండగా వినుచు, పుస్తకమునుచూడకయే, అనువదించుచు పోయెడివారట. వారికి సంస్కృత మూలము ఎంత స్వాధీనమైయుండి, అనువాదశక్తి ఎంత అపారమై యుండినదనగా, చదువువారు చదువుటను పూర్తిచేయులోపల వీరి యనువాదమును పూర్తియైయుండెడిది. వ్రాత పుస్తకమును అప్పుడే మూసి వేసెడివారు. ఇది ఆ చదివెడి వారికే ఆశ్చర్యము కలిగించెడిది. ఈ యనువాదము మొదట జనవినోదినిలో ప్రకటింపబడి, తర్వాత పుస్తక రూపమున ప్రకటింపబడినది. తమ కాలము చాల విలువయైనందున ఒక పనినుండి మఱియొక పనికి మార్చుకొనుటయే విశ్రాంతి యని వారి యభిప్రాయము. ఆకాలమున, శాస్త్రిగారు చదువుకొను గదికి అలంకారముగా, గదిలో, అట్టలమీద 'నా కాలము చాల విలువయైనది', 'నా కాలమును వృథా చేయకుడు', 'బుద్ధిః కర్మానుసారిణీ' — ఇత్యాదిగా వ్రాసి తగిలించి యుండెడిదని శ్రీ ఒంగోలు వేంకటరంగయ్యగారు నాకు చెప్పియున్నారు.

1886 లో తెలుగు ఛందస్సు మీద, 'ప్రక్రియా ఛందస్సు' అని యొక చిన్న పుస్తకమును, విద్యార్థులకు చిన్న పాకెట్టు సైజులో, ఇంగ్లీషు వివరణముతో ప్రకటించిరి. దీనినే, తర్వాత, తమ జీవిత చరమదశలో, ఇంగ్లీషు భాగమును తీసివేసి, పూర్తిగా మరల వ్రాసిరి. వారు గతించిన తర్వాత 1930 లో, నేను దీనిని ప్రకటించితిని. ఆ సంవత్సరమే, (1886) అదే సైజులో, అలంకార సార సంగ్రహమును, తెలుగు అలంకారముల మీద, టీకా తాత్పర్యములతో, విద్యార్థులకును, విద్యావంతులకును కూడ, ఉపయోగపడునట్లుగా ప్రకటించిరి. సంస్కృతము చదువగోరు వారికి సంస్కృత వచన గ్రంథములైన భోజ చరిత్ర, విక్రమార్క చరిత్రములను అనువాద వివరణములతో, ఆ చిన్న రూపములోనే ముద్రించిరి. అటువంటి గ్రంథములను ఒక గ్రంథమాలగా ప్రకటించు నుద్దేశముతో 1890 లో జ్యోతిష్మతియని పేరు పెట్టి, ఒక ముద్రాక్షరశాలను ప్రారంభించి, 1891లో, డెమ్మీ సైజులో, తమ కథాసరిత్సాగరము సంతటిని, వేంకటగిరి మహారాజా శ్రీ రాజగోపాలకృష్ణయాచేంద్రులవారి ధన సహాయమున ముద్రించిరి. ఆ సంవత్సరమే శ్రీహర్ష మహాకవి యొక్క నాగానంద నాటకమునకు తమ యాంధ్రానువాదమును, పై చిన్న రూపములోనే ప్రకటించిరి గాని దానిని తమ ముద్రాక్షరశాలలో ముద్రింపక ఇతరత్ర ముద్రించిరి. తమకు విద్యాభంగమని ముద్రాక్షరశాలను విక్రయించివేసిరి.

సంస్కృతనాటకపఠనమందే తమదృష్టిని కేంద్రీకరించి, 1886 లో, కాళిదాసు యొక్క అభిజ్ఞానశాకుంతల నాటకమునకు, అంతకుముందే

దానిని మదరాసు క్రైస్తవ కళాశాలలో తాము పలుమార్లు పాఠము చెప్పి ఆడించియుండినయనుభవముతో, తమ యాంధ్రీకరణమును ప్రకటించిరి. 1897 లో, దేశచరిత్రయందే గుర్తుంచుకోదగిన, తమ స్వతంత్ర రచనయైన ప్రతాపరుద్రీయ నాటకమును ప్రకటించిరి. దీని ప్రకటనము దేశమునే ఆశ్చర్యకరముగ, తుపానువలె, ఒక ఊపు ఊపినది. దండివలె నిర్దాక్షిణ్య విమర్శకులైనందువలన పత్రికలలోను ప్రత్యేకపుస్తకములుగాను తమ సమకాలికుల రచనలను విపులముగా విమర్శించి, నెల్లూరివారైన శ్రీపూండ్ల రామకృష్ణయ్యగారి సంపాదకత్వమున వెలువడుచుండిన అముద్రిత గ్రంథ చింతామణి అనెడు పత్రికలో, నాటి తెలుగు పండితులు కొందఱు సంపాదించి ప్రకటించిన జక్కనవిరచిత విక్రమార్కచరిత్రము (14 శతాబ్ది) యొక్క ముద్రణమును సమగ్రముగా విమర్శించిరి. దానినే ఒక చిన్న పుస్తకముగా ప్రకటించి 'శారదాకాంచిక', 'ప్రథమకింకిణి'యని పేర్కొనిరి. 'శారదాకాంచిక' యనగా విద్యాధిదేవతయగు శారదాదేవియొక్క ఒడ్యాణము. కింకిణియనగా చిన్న గంట. దేవియొక్క ఆభరణమునకు అలంకారము. ఈ విధముగా తాను ఒక వరుసక్రమములో లెక్కలేని విమర్శలు ప్రకటించు నుద్దేశమును తెలిపిరి. అట్లే, ఆ సంవత్సరమే, తమ యొక్క ప్రధాన విమర్శ గ్రంథమును ప్రకటించిరి. ఇది సమకాలిక పండితులను ఒక ఊపు ఊపుట మాత్రమే కాదు, తర్వాత అర్ధశతాబ్దము వఱకు, వారికి సమాధానము చెప్పుటకు పండితులు పరిశోధనలుచేసి విషయసంకలనము చేయవలసినంతవఱకు పోయినది. దీనిని శారదాకాంచిక ద్వితీయ కింకిణియని పేర్కొనిరి. అది మూడువందల పుటల పెద్ద గ్రంథము, జయదేవుని ప్రసన్నరాఘవ నాటకమునకు శ్రీకొక్కొండ వేంకటరత్నము పంతులుగారు రచించిన యాంధ్రానువాదము నిష్ప్రయోజనమని నిరూపించునట్టిది. శ్రీ పంతులుగారు మదరాసు ప్రెసిడెన్సీ కాలేజిలో తెలుగు పండితులు, సమకాలిక రచయితలో ప్రసిద్ధులు. ఈ విమర్శలో శాస్త్రిగారు అనువాదముయొక్క దోషములను వెల్లడించుటయే గాక, జయదేవుని మూలముయొక్క ఉత్కృష్టతనుకూడ విశదీకరించిరి.

శాస్త్రిగారి వాఙ్మయపరిశ్రమల ఫలితముగా వెలువడినపైగ్రంథముల వలన ఆంధ్రదేశమందలి పండితులలో ఒక పెద్ద అలజడియేర్పడి, వారికి బ్రహ్మాండమైన ఎదురువాదదుమారము బయలుదేరినది. దాని ప్రతిఫలముగా పండితుల దృక్పథమే మారి క్రొత్త ఆలోచనలు బయలుదేరినవి. ఇచ్చట కొంత వివరింపవలసి యున్నది. ఎందులకనగా, ఇది వేంకటరాయ శాస్త్రిగారి జీవితమందును, ఆంధ్రవాఙ్మయ చరిత్రమందును నూతన పరిణామ దశకు దారితీసినది. సులువుగా ప్రసిద్ధిని సంపాదించు నుద్దేశముతో సమయానుకూలవర్తులు, శాస్త్రములకు అపార్థములు కల్పించి, విమర్శలను

త్రోవతప్పించి చేయు దుష్ప్రచారము వారికి బొత్తిగా సరిపడలేదు. సంఘ సంస్కరణమునకుగాని నూతన వాఙ్మయ ప్రణాళికలకుగాని, వారు వ్యతిరేకులనికాదు. సంస్కృత మూలశ్లోకములను మెలితిప్పి వానికి ఆధునిక కాలానుగుణ్యమైన యపార్థములను లాగుట వారికి బొత్తిగా సరిపడలేదు. చక్కని సంస్కృతపండితు డైనందున ఆ మహనీయుల రచనలకు ఇట్టి దోషభూయిష్ఠమైన ఆంధ్రీకరణములును విమర్శలును వారికి ఎటుచూచినను సమ్మతి కలిగింపలేదు. నాటకరచనలో, వచననిర్మాణములో, విమర్శన ధోరణిలో, కవిత్వసరళిలో, తప్పక నూతనమార్గములలో నడువవలసినదే, అదే వారి యభిలాష; నలిగి నలిగియున్న ప్రాచీన ప్రబంధ ఫక్కినుండి వైదొలగవలసినదే, కాని పూర్వ సంప్రదాయము నుండి పూర్తిగా కత్తికోత వలె, విడిపోవుట కూడదని వారియుద్దేశము. ఆధునిక వాఙ్మయసౌధమును, ప్రాచీన వాఙ్మయ సంస్కృతులనబడు దృఢగుణావర్ధముల మీద (పునాదుల మీద) నిర్మించుట మంచిదని వారి యుద్దేశము.

సాధారణముగా అవశ్యకతను బట్టియే నూతన కల్పన యేర్పడుచుండును. ఆధునికాంధ్ర వచనము, పరస్పర వ్యవహారమునకు జాబులకు జవాబులకు గల ఆవశ్యకతలను బట్టి, ఏర్పడినదే గాని దీనికి ముఖ్యకారకుడైన ప్రధాన పురుషుడెవడును లేడు. జనుల జీవితములలో కలిగిన మార్పులవలన రచయితలు గూడ నూతన వాఙ్మయ ప్రక్రియలను, పాశ్చాత్య వైఖరులలో అవలంబింపవలసి వచ్చినది. అంతేగాని మన పండితులకే పూర్వ పద్ధతుల వలన కలిగిన ఆలోచనలుగావు, భారతీయులకును లేదు. ఆంధ్రులకును తమంతట తోచినవి గావు.

మధుర, తంజావూరు, పుదుక్కోట రాజుల పాలన కాలములోనే, పదునేడవ శతాబ్దమందే, తెలుగులో వచన వాఙ్మయము సులభ శైలికి దిగినది. ప్రబంధ శైలిని సంగీతమునకును కొన్ని సంప్రదాయ బద్ధ రచనలకును మాత్రమే ఉపయోగపరచుచుండిరి. పురాణములలోని కథలును చారిత్రక విషయములును సులభమైన జాబుల శైలిలో ప్రబంధశైలికి భిన్నముగా వ్రాయుట ప్రారంభమైనది. వింతయేమనగా దాక్షిణాత్య వచన శైలి, ప్రాచీన పద్ధతివలె అనుస్వారముతో వ్రాయబడుచు, చిన్నయసూరి పందొమ్మిదవ శతాబ్దపు శైలికి పూర్వగామిగాను, దాక్షిణాత్యుల సంభాషణ శైలికి చేర్పుగానున్నది. దీనికి విభిన్నముగా సర్కారులలో గ్రాంధికభాషకును వ్యావహారిక భాషకును ఎంతో వ్యత్యాసముండునట్లు చాల మార్పులు జరిగినవి. వచనరచనలో నూతన శైలికి పండితులు మార్గదర్శకులు. అట్టివారిలో ప్రథముడు చిన్నయసూరి, అటు వెనుక ఎందరో పాఠశాలలక్షును కళాశాలలకును వచన పుస్తకములను, ఒకరిని మించి యొకరు,

సులభశైలిలో వ్రాసిరి. వీరందఱును, సర్వాంధ్ర దేశ సమ్మతమైన సలక్షణ ప్రామాణిక భాషనే యవలంబించిరి. కొందఱు బ. సీతారామాచార్యుల వారి వంటివారు సంధిని మాని, విసంధిగా, వాక్యములను చిన్నవిగా వ్రాయనారంభించిరి. వీరేశలింగముగారును వేంకటరాయశాస్త్రిగారును రంగమును ప్రవేశింపక మునుపే ఎంతో పరిణామ మేర్పడినది. పూర్తిగా గురుజాడ వారివలె ఆధునిక రచన చేయుటకు ధైర్యము లేకపోయినను, కొక్కొండ వెంకటరత్నము పంతులవారి వలె, ప్రాచీన శైలిలో, బొత్తిగా మార్పునకు ఎంత మాత్రము ఒప్పుకొనని పద్ధతిలో వ్రాయక, వీరేశలింగముగారు, చిన్నయసూరి శైలి నుండి క్రమముగా సులభశైలిలో, పత్రికలకును సామాన్య రచయితలకును పనికివచ్చు శైలికి పరిణమించిరి.

వారి సమకాలికులు శ్రీ వేంకటరాయశాస్త్రిగారు తత్తుల్యమైన సులభ శైలిలో వ్రాసినను, కవితాస్ఫోరకముగా, విషయానుకూలమైన వివిధ శైలులలో వ్రాసిరి. విశాల వాఙ్మయ ప్రాంగణమున, కథా కథన శైలిలోను, పరస్పర వ్యవహారోపయుక్తమైన శైలిలోను, సూటిగాను నాటకోచితముగాను, భిన్న సందర్భోచితముగాను రకరకములైన శైలీ భేదములు చూపిరి. వారి కథాసరిత్సాగరములో మూలముయొక్క కవితా మాధుర్యము కనబడును. మూలము శ్లోకమయమైనను ఆధునిక వచన వాఙ్మయావశ్యకతను గుర్తించి, పదునెనిమిది లంబకముల యీ మహాగ్రంథమును, సులభ వచనముగా, బహుప్రయోజనసాధకముగా వ్రాసిరి. అనువాదము గాన, అర్థము చెడనీయక, అలంకారాది కావ్యగుణములు పోనీయక, మూలమును పూర్తిగా అనుసరించిరి. అట్లు అనువదించుచునే స్వతంత్ర రచనవలె సంతరించిరి. నేటి ఉన్నత పాఠశాలల విద్యార్థులకు కఠినముగా నుండినను, ఆ కాలమున (1891) సమకాలికులు దీని నొక నూతన శైలిగాను, ఎంతో నేర్పుతోడిరచనగాను హర్షించిరి. సంస్కృత మూలమును చదువగోరు వారికి ఈయనువాదము, మూలమును, ప్రతిపదమునందును, వాక్యమునందును, అతిక్రమింపని దైనందున, అత్యుత్తమ సహాయకారి.

వచన రచయితగా వేంకటరాయశాస్త్రిగారి రచన వారి నాటకములలో పరాకాష్ఠనందినది. వానిలో ఎంతో సామర్థ్యముతో వ్రాసిరి. మధ్య శతాబ్దములలో యక్షగానములే విరివిగా వీధి నాటకములుగా ఆడబడుచుండినందున తెలుగు రంగ నాటకములు పందొమ్మిదవ శతాబ్దము నుండియే మొదలైనవి. సంస్కృత నాటకములుండియు ప్రాంతీయ భాషలలో ఆధునిక యుగము వఱకు నాటకములు ప్రారంభము కాలేదు. రంగములో ప్రథమస్థానము సంపాదించు నుద్దేశముతోను, తొందరపాటు చేతను కొందఱు సంస్కృత నాటకములను అనువదించిరి. వారికి సంస్కృత నాటకరంగము యొక్క

స్వభావముగాని, పరమోద్దేశముగాని బొత్తిగా అవగాహన కాలేదు. వచనము చాల సులువుగా వ్రాయబడుటయు, పద్యములు నాతికఠినముగా, సంభాషణ శైలి కనుగుణముగా అల్లబడుటయు జరిగినదిగాని, పద్యములును వచనములును, ఒక్కటే విధమైన శైలిలో వ్రాయబడుటచేత వానిలో రసము చెడినది. నాటకములలోని వచనములకుగాని, పద్యములకుగాని, పాటలకుగాని, ఆయా పాత్రలకు తగినట్లు, ఎట్టిశైలీ భేదమును గాని నాటిరచయితలు చూపలేదు. రాజుగాని సేవకుడుగాని, పండితుడుగాని పామరుడుగాని, స్త్రీగాని పురుషుడుగాని, బాలుడుగాని వృద్ధుడుగాని, అందరును ఒక్కవిధమైన భాషను, వ్యాకరణబద్ధమును, ఉదాత్త శైలిలో మాటలాడుట ఆ పాత్రల నైజ స్వభావమునకు విరుద్ధము. ఒకవేళ ఈ రచయితలు తమ నాటకములను రంగ ప్రయోగముల కుద్దేశించి వ్రాసియుండరు. నాటకము తరగతిలో చదువుకొనుటకన్న రంగ ప్రయోగమునకే ప్రధానముగా ఉద్దిష్టము - అన్న విషయమును వేంకటరాయశాస్త్రిగారు గ్రహించిరి. తాము నాగానందమును అభిజ్ఞానశాకుంతలమును అనువదించుటలో, భరత నాట్యశాస్త్రమందలి ప్రాకృతభాషాప్రయోగ పద్ధతిని అనుసరించి, ఆయా నాటకముల మూలములలో నున్నట్లే, తమ యనువాదములలో పాత్రోచిత భాషను ప్రయోగించిరి. ఆంధ్ర దేశమందలి ప్రాంతీయ భాషల గ్రామ్యములను, వాని వాని వైవిధ్యములను, తరగతుల ప్రకారము నీచ పాత్రలకు ప్రయోగించిరి. ఈ పద్ధతి ప్రకారము ఉత్తమ పాత్రలకు మూలములో వలెనే, వ్యాకరణ యుక్తమును నాజూకును ఐన సలక్షణ భాషయు, స్త్రీలకును పనివాండ్రకును మనము ఇండ్లలోను సంఘములోను మాటలాడు మామూలు వ్యావహారికమును వాడిరి. ఈ నూతన మార్గము చాలమందికి కనువిప్పై ఆనందము కలిగించినది. పండితులు, ఆమోదించి శాస్త్రిగారిని అభినందించిరి. కొందఱు పండితులు ఎంతో లోకజ్ఞానముండి, జనులను పరిశీలించినగాని, అట్టి జ్ఞానము కలుగదనియు, దానికి ఎంతో కళాదృష్టి కావలెననియు, అట్టిది తమకు లేనందువలన అట్టి రచనయు ఇతరులకు అసాధ్యమనియు తలచిరి. శ్రీ గురుజాడ అప్పారావుగారు, మఱెందులకో ఉద్దేశించి వ్రాసినను, ఈ విషయమును గుఱించి తమ కన్యాశుల్క నాటక ద్వితీయ ముద్రణోపోద్ఘాతమున నిట్లువ్రాసిరి.

'మనము ప్రతిదినము మాటలాడు తెలుగు భాషయొక్క గుణ విశేషములను, దాని మార్దవసౌలభ్యములను, దాని విశాలప్రయోగ శక్తిని పాశ్చాత్యులు పొగడియుండగా, నేటి మన రచయితలు, ఏల గుర్తింపరో నాకు అర్థమగుటలేదు. ప్రస్తుతము, ఉత్తమ వచనము మనము మాటలాడు భాషయే. ఇది వింతగా కనబడవచ్చునుగాని, మన తెలుగు వచనము పుట్టి

వృద్ధియైనది రాజపోషణ వలన కాదు. విదేశీయ వాఙ్మయ ప్రభావము వలన కాదు - ఒక విచిత్రమైన ఆంగ్లేయుని ప్రయత్నము వలన, ఇతడు ప్రాంతీయ దేశచరిత్రను (దైనందిన) దేశభాషలలో గతశతాబ్ద ప్రారంభమున వ్రాయించెను. మెకంజీ సేకరణలో, వాస్తవముగా ఉత్తమాధమ భాగములు గలవు, కాని కవితాగుణములో, శైలీవేగములో, భాషా పాటవములో ఇవి ఉత్తమ వాఙ్మయమునే అధఃకరించినవిగా నున్నవి. కాని అన్నిటికన్నను తెలుగు భాషావిశేషమేమనగా, వీనిలో కాలానుగుణ్యముగా జనుల హృదయము వ్యక్తమగుచున్నది. తమకు తెలియకయే, అప్రయత్నముగా, రాయి బహదూర్ కె. వీరేశలింగము పంతులుగారు ఆంధ్రభాషకు గొప్ప సేవ చేసినారు. అది యేదనగా తమ రచనలను సేకరించి ప్రకటించిన మొదటి సంపుటము, ఇందులో వివిధ ప్రాంతీయ భాషలను, తరగతులకు తగినట్లు, వ్యాకరణ శుద్ధముగా ప్రయోగించి, తాము తెలుగులోనికి అనుకూలముగా సంతరించిన ఆంగ్ల (రంగ) ప్రహసనములు, భారతీయ జీవితమును ప్రతిబింబింపజేయు ప్రహసనములును కలవు. వీనిని సంగ్రహించుటలో వారు చూపిన నేర్పు, వారి సూక్ష్మఇంగిత జ్ఞానమునకు వన్నెతెచ్చుచున్నది. ఎందుచేతననగా ఈ మొదటి సంపుటములోనే వాస్తవముగా వారి అత్యుత్తమ రచనలు గలవు. ఇవే చదువరులలో గొప్ప సంచలనము గలిగించి నవి. కాని, నాటకములలో, సంస్కృత నాటక సంప్రదాయము ప్రకారము, ప్రయత్న పూర్వకముగా, మనము మామూలుగా మాటలాడునట్టి భాషను ప్రవేశపెట్టిన గౌరవ ప్రతిష్ఠ నామిత్రులు వే. వేంకటరాయశాస్త్రిగారిది. వారి ప్రతాపరుద్రీయ నాటకము యొక్క అపార ప్రతిష్ఠ అంతయు అందలి ప్రాంతీయ భాషాప్రయోగము వలననే. నాయొక్క నాటకము కూడ మనము మాటలాడు భాషలో వ్రాయబడిన మొదటి రచన, అట్టిదని నేను సగర్వముగా ఆశించునట్టిది. సర్వవిధముల అది తక్కువపడలేదు. మేలు రచనయే. కాని రచయితల యొక్క న్యూనాధిక్యములను బట్టి భాషలయొక్క పటిమను పరీక్షింపరాదు. (భాషాపాటమునకును రచయిత యొక్క శక్తిసామర్థ్యము నకును సంబంధములేదు. రచయిత చేతగానివాడైనయెడల అది భాష యొక్క లోపముగాదు.)'

ప్రతాపరుద్రీయ నాటకము పాత్రోచితభాషా ప్రయోగమునకు అత్యుత్తమ మైన ఉదాహరణముగా కుదిరినది. ఇందులో కవికి తన చిత్తము వచ్చినట్లు కవితావిహారము సల్పుటకు అవకాశము దొరకినది. పరంపరాగతమైన పూర్వ కథను గ్రహించినారు. దానిని పదియంకములలో వ్రాయదగిన మహానాటక మునకు అనుగుణముగా, అనేక సన్నివేశములను పాత్రలను సృజించి మహోత్కృష్టమైన కళాఖండముగా పెంచినారు.

మహమ్మదీయులు దక్షిణదేశ దండయాత్ర సాగి
దక్షిణ రాజ్యములు ఒక్కొక్కటియు వారికి స్వాధీనములగుచుండగా, ఢిల్లీ సుల్తాను ఘ్యాజుడ్డీనుటొగ్లాకుయొక్క సేనలు క్రీ. శ. 1323 లో ఓరుగల్లును పట్టుకొనగా ప్రతాపరుద్ర చక్రవర్తి ఢిల్లీకి చెరగొనిపోబడెనని చరిత్ర చెప్పు చున్నది. ప్రతాపరుద్రుడు మరల తన దేశమునకు రాలేదు. కాని తెలుగువారి పెద్దల పారంపర్యరచనలు ఇందులకు భిన్నముగా నున్నవి. ఒక రచన ప్రకారము ఢిల్లీకి చెరగొనిపోబడుచుండగా, మార్గమధ్యమున, గోదావరీ తీరమందు మరణించెనట. మఱియొకదాని ప్రకారము కమ్మ మొదలైన జాతులకు చెందిన నాయకులు రాజును చెరవిడిపించిరట గాని, కొద్దికాలమే యైనను, పరాజయ కారాగారవాసావమానమును భరింపలేక, ప్రభువు, గోదావరీతీరమున ఆత్మహత్య చేసికొనెనట. బ్రాహ్మణమంత్రి యుగంధ రుని పేరు సమకాలికులలో ఎచ్చటను కానరాదు. కాకతీయ యుగపు కవులు, మంచన మారనలు యుగంధరుడు అతి ప్రాచీనుడైన ఉదయనుని మంత్రియని వ్రాసియున్నారు, కాని ఒక వింతయేమనగా, మెకంజీదొరవారి వ్రాతపుస్తకములలో పరంపరగావచ్చిన యుగంధరుని కథ యున్నది. ఈ యుగంధరుడను బ్రాహ్మణుడు, మంత్రి, పిచ్చివానివలె ఢిల్లీలో తిరుగుచు, తనవాండ్రను, సైన్యమును, మారువేషములో చుట్టును పెట్టుకొని, ఉపాయముగా రాజును విడిపించుకొనెనట, ఈ కథను బాల్యములో తమ తండ్రిగారివలన విని శాస్త్రిగారు, ఎంతో పెంపకము చేసినారు. లెక్కలేని పాత్రలను, ఉత్తములను అధములను, బుద్ధిమంతులను మూర్ఖులను, దయాళువులను కఠినాత్ములను సృజించి ముద్రారాక్షసమునందువలె వేగరులచేత కార్యము సాధించిన రాజకీయ వాతావరణమును సమకూర్చి నారు. హిందూదేశ చరిత్రమందు మహమ్మదీయ మహాయుగ ప్రారంభ కాలపు ఢిల్లీ ఓరుగల్లులు రంగభూములుగా నాటకము హిందూ మహమ్మదీయ సఖ్యమున మంగళాంత మగుచున్నది. ఈ భావము ఇతరులకు కలుగుటకు చాలకాలము ముందే వారికి కలిగినది. ముద్రారాక్షస నాటకమునకంటె ఈ నాటకమున భాసుని ప్రతిజ్ఞాయౌగంధరాయణము యొక్క లక్షణములు అందలి శృంగారము మినహాగా నున్నవి.

శాస్త్రిగారు కథలో, తాము తండ్రిగారి యొద్దనుండి విన్నదానికన్న, కొన్ని మార్పులు కావించినారు. రాజు యుద్ధములో బందికాగా, నాటకములో, వేటాడునప్పుడు పట్టుకొనబడెనని మార్చినారు. ఒక పగలంతయు వేటాడి, అలసిపోయి, ఒక చెట్టు క్రింద ఒక మారుమూల నిద్రించుచుండగా, గోదావరీనదీ తీరారణ్యమున, మహమ్మదీయులు చెరపట్టుకొనిరి. ఉదయనుని కూడ వేటాడు నరణ్యములో శత్రువులు పట్టుకొన్నను అతడు

మేలుకొనియే యుండి ఎదిరింపగా, శత్రువులు మందిబలగము చేత, పట్టుకొనిరి. శత్రువులకు పట్టుబడుట నాయక వీరోచితము గాదని, నాటకోచితముగా మార్చిరి. రెంటిలోను సాదృశ్యమేమనగా, ఇరువురు రాజులును తమ మంత్రులచేత, వారు పిచ్చివాండ్రుగా ప్రవర్తించిన పన్నాగముల చేతనే విడుపునందిరి. ఉదయనుని శత్రువు హిందువు, పైగా మైత్రి నపేక్షించినవాడు. ప్రతాపరుద్రుని శత్రువు మహమ్మదీయుడు, వాస్తవముగా ద్వేషి. భాసుని నాటకములు ప్రకటింపబడుటకు చాలకాలము ముందే, అటువంటి భావమే శాస్త్రిగారికి కలుగుట ఆశ్చర్యమే. దీనికి కారణము ఆంధ్రదేశమందలి పరంపరాగతమైన కథగా నుండవచ్చును. ఉదయనుని కథయు బృహత్కథయు, ఇంకను ఇతర ఆకరముల నుండి తెలిసినదే. కాని 1909 లో శ్రీ గణపతి శాస్త్రిగారు త్రివేంద్రములో కనుగొని, 1913 లో ప్రకటించువఱకు, సంస్కృత వాఙ్మయములో భాసుడు నామమాత్రావశిష్టుడు. భాసుని నాటకము కూడ చాల చిన్నది. శాస్త్రిగారి పెంపకమంతయు వారి సృష్టియే. భాసుని నాటకము నాటకీయ కథా కల్పనయందుగాని, కథాగమన నిర్వహణమందుగాని, నాటక నిర్మాణమందుగాని, దీనికి ఈడు రాదు.

1898 సెప్టెంబరు నెల, మదరాసు క్రైస్తవ కళాశాలవారి మాసపత్రికలో ప్రతాపరుద్రీయ నాటకము ఇట్లు సమీక్షింపబడినది. — "మేము వారిని వారు గ్రహించిన చక్కని కావ్య వస్తువునకు అభినందింపక తప్పదు. వారు విజయవంతముగా తమ యుద్దేశమును నెరవేర్చినందులకు కూడ వారిని అభినందింపవలెను. కాని దక్షిణదేశమందలి మేధావుల సారస్వత ప్రజ్ఞను అల్పమని అలక్ష్యపఱచు వారికి ప్రతాపరుద్రీయ మొకటే తగిన జవాబని మేము తృప్తినందగలము. ఈ నాటకము ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో నూతన మార్గమును త్రొక్కినది. రెండవది, ఈ నాటక రచయిత ఇదివఱకే సంస్కృత నాటకమార్గమును వివరించుటలో తమ పాండిత్యమును ప్రదర్శించి మూలమునకు చేర్పుగా అనువదించుటలో మేటియని ప్రసిద్ధులు. అంతేగాదు, తెలుగులో కూడ ఉత్తమ పద్య గద్య కావ్య రచయితగాను ప్రసిద్ధినందినవారు. మీదు మిక్కిలి తమ పాండిత్యతృష్ణ యొక్క తృప్తి కొఱకే గాక, సంస్కృత నాటక ప్రయోగ విషయమున ప్రక్రియా ప్రామాణికత కొఱకు గూడ పరిశోధనలు సలిపి నాటకకళ నెఱింగినవారు. అట్టి రచయిత యొక్క రచన విద్యావంతుల కుతూహలమును రేకెత్తింపక తప్పదు."

నూతన విధాన సూచకమైన ఈ నాటకము, రచయితచేత, తమ కథాసరిత్సాగరాది ప్రచురణములకు పోషకులైయుండి పదే పదే ధనసహాయము చేయుచుండిన వెంకటగిరి మహారాజా వారికి అంకితము చేయబడినది.

ఆ సంవత్సరమే (1897) పూర్తి విశాఖపట్టణపు వ్యావహారిక భాషలో వ్రాయబడిన, శ్రీ గురుజాడ అప్పారావుగారి, కన్యాశుల్కము వెలువడినది. దాని ఇతివృత్తము సాంఘికమైనందువలన పాత్రోచితముగా ఆ భాషయు సరిపోయినది. ఒక పురుషాంతరము తరువాత క్రొత్తతరమువారు, అది వ్యావహారిక భాషకు (మాటలాడుకొను భాషలో రచన సాగించుటకు) ప్రారంభకాలమని భావించినను సమకాలికులు దానిని పాత్రోచిత భాషా ప్రచారము యొక్క అంతర్భాగమనియే గ్రహించిరి. సమకాలిక భాషా వాఙ్మయ విమర్శక పత్రిక, అముద్రిత గ్రంథ చింతామణి, దీనిని వేంకటరాయ శాస్త్రిగారి వాదమునకు ప్రోద్బలముగానే సమీక్షించినది. ఆ కాలములో వ్యావహారిక వాద ప్రచారమును గుఱించి బొత్తిగా పత్రికలు తలంచినట్లులేదు.

ఆ కాలపు పత్రికా ప్రచారమును గుఱించి ఒకమాట ఇచ్చుట అనుచితము కాదు. ఈ కాలమందే తెలుగులో పత్రికాప్రచారమునకు ఒక రూప మేర్పడి, తెలుగులో విమర్శ వాఙ్మయము పెంపొందింపబడినది. పండితులే సొంతముగా పత్రికలు ప్రారంభించి, తమ యభిప్రాయములను ప్రకటించుకొనుటయే గాక తమ్ము విమర్శించు ప్రతిపక్షులను తాకుటకును, బదులు విమర్శలు వ్రాయుటకును వినియోగించుకొనెడివారు. శ్రీ యుతులు పూండ్ల రామ కృష్ణయ్య ఒడయారు వీరనాగయ్య యనువారలు 1885లో అముద్రిత గ్రంథ చింతామణియను మాసపత్రికను నెల్లూరిలో ప్రారంభించిరి. దొరకనివియు అపూర్వములునైన వ్రాత ప్రతులను ప్రకటించుటయేగాక వీరు సుప్రసిద్ధ తెలుగు రచయితలకు తమ పత్రికను ఒక వేదికగా పెంపొందించిరి. వీరేశలింగము పంతులు, వడ్డాదిసుబ్బరాయుడు, ధర్మవరము రామకృష్ణమాచార్యులు, కోలాచలము శ్రీనివాసరావు, వావిలాలవాసు దేవశాస్త్రి, కొక్కొండ వేంకటరత్నం పంతులు, రాజాశ్రీ విక్రమదేవవర్మ, మండపాక పార్వతీశ్వర శాస్త్రి మొదలైన ఎందరో పండితులు ఈ పత్రికకు రచయితలు. వీరందరిలోను ప్రధానులు వేదము వేంకటరాయశాస్త్రిగారు. వీరియాంధ్ర మహాభారత విమర్శనాది వ్యాసములు ప్రత్యేక రచనలు. కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు 'ఆంధ్రభాషాసంజీవని' యను పక్షపత్రికను నిర్వహించుచుండిరి. ఈ పత్రికలుగాక శశిలేఖ, ఆంధ్ర ప్రకాశిక సూర్యాలోకము, కళావతియని కొన్ని ప్రసిద్ధపత్రిక లుండెడివి.

సమకాలికుల రచనలమీద వేంకటరాయశాస్త్రిగారు వ్రాసిన విమర్శనలు వారికి ప్రతిస్పర్ధులను లేపి, ఆ పండితులందరును, ఆంధ్ర కవిపండిత సంఘమనుపేర నొక అఖిలాంధ్ర సంఘమును స్థాపించునట్లు చేసినది. వాఙ్మయములో అది కొత్తపోకడల కాలము, పండితులు తమ విమర్శక రచనలలో పరస్పర వ్యక్తి దూషణలు చేసికొనెడివారు. అది నాటిపద్ధతి. కాని ఇతరుల

వలెగాక శాస్త్రిగారి రచనలలో ఎంతో తులానాత్మక పరిజ్ఞానము ఉండెడిది. తమ సంస్కృత వాఙ్మయ పరిజ్ఞానమంతయు ఆయా విమర్శలలో నుపయోగించి చూపెడివారు. సంస్కృత నాటకమును ఎట్లు చదువవలెనో, ఎట్లు ఆంధ్రీకరింపవలెనో చేసి చూపినారు, ఒక ముఖ్యమైన విషయమును నొక్కి వక్కాణించినారు అది కవిహృదయము. కవి ఏమి చెప్పనెంచెనో దానిని చూచి గ్రహించుట ప్రధానముగాని పట్టి వాక్యార్థము కాదని తెల్పిరి.

ఆంధ్ర దేశమందలి పండితులెందరో ఆ సమావేశములకు వచ్చి అచటి చర్చ లెట్లుపరిణమించునో జాగ్రత్తగా పరిశీలించెడివారు. ఆ సంఘము యొక్క ప్రధానోద్దేశమే పాత్రోచిత భాషా ప్రయోగమును ఖండించి ప్రతాపరుద్రీయ నాటకమును బహిష్కరించుట. శ్రీగురుజాడవారు ఆ సమావేశములకు వచ్చి శాస్త్రిగారి విజయము నభిలషించి యుండిరి. వీరేశలింగముగారు దూరముగా నుండిరి. దేశమందలి సహృదయులకు తృప్తియు ఆనందమును కలుగు నట్లుగా సంస్కృత నాటకముల నుండియు, భరతనాట్య శాస్త్రము నుండియు, ఉదాహరణములు చూపి శాస్త్రిగారు తమ వాదమును సామర్థ్యముతో నిలువబెట్టుకొనిరి.

ఈ విజయానంతరము 1900 లో శాస్త్రిగారు కాళహస్తి మాహాత్మ్యము కావ్యమును కొందరు ప్రతిపక్ష పండితులు ప్రకటించినదాని ముద్రణమును విమర్శించిరి. 1901 లో నాటక పాత్రోచిత భాషపై తమ వాదములను చేర్చి యొకపుస్తకముగా వ్రాసి, దానికి గ్రామ్యభాషాప్రయోగ నిబంధన మని పేరుపెట్టి శారదాకాంచికలో నాలుగవకింకిణిగా ప్రకటించిరి. 8 - 1 - 1935 లో దీని పునర్ముద్రణమును సమీక్షించుచు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు ఇట్లు విశదీకరించినారు.

'ఈ పుస్తకము - నేడు మనకు సామాన్యములుగా కనబడు విషయముల మీద, మన పండితులు, వివాదములు కొనసాగించిన విషయమును గురించిన పాత ప్రచురణములలో ఒకటి, నాటకములలో తెలుగు గ్రామ్యము యొక్క ప్రయోగము విషయము. వేంకటరాయశాస్త్రిగారు తమ నాటకములలో తాము నీచపాత్రలని తలంచిన వానికి గ్రామ్యభాషను ప్రయోగించిరి. ఇది సంస్కృత నాటకములలోని పద్ధతికి సమానముగా - ఉత్తమ పాత్రలకు సంస్కృతమును, ఇతర పాత్రలకు ప్రాకృత భేదములను ప్రయోగించురీతిని - తెలుగులో అనుసరించినది. ఇచ్చట తాత్పర్యమేమనగా విద్యావంతులభాష సంస్కృతమనియు ప్రాకృతభేదములు అసంస్కృతములనియు జనుల తరగతులనుబట్టి భేదించుచుండుననియు. ఇచట ముఖ్యముగా గ్రహింప వలసినది ఏమనగా రాజకులమునందును మంత్రికులమునందును, వేశ్యాగృహములందును సంస్కృతము వాడబడవలయునట. ఇతర స్త్రీలకు కూడదట. ఈ సామ్యము

ప్రకారము వేంకటరాయశాస్త్రిగారు విద్యావంతులైన కులాలవారికి గ్రాంథి కాంధ్రమును తదితరులకు గ్రామ్యభేదములను ప్రయోగించిరి. ఈపద్ధతిని శాస్త్రిగారి సమకాలికులు ఎదుర్కొనిరి. వారు దీనికి బదులుగా వ్యాకరణ యుక్తమైన భాషను ప్రయోగించుచు, శాస్త్రిగారి గ్రామ్యభేదములకు బదులు సంస్కృతములేని, కృతకమైన అచ్చతెలుగుభాషను ప్రయోగింపసాగిరి. ఈ యిరుకక్షల వారికిని రామ రావణయుద్ధమైనది. ఇరువురును, శాస్త్రమునే ప్రమాణీకరించిరి. ఈ విమర్శన గ్రంథముతో వేంకటరాయశాస్త్రిగారు వారిని జయించిరి. శాస్త్రిగా రెంతప్రాచీనాచారపరులై యుండినను నాటకకళను విశదీకరించి ఆంధ్రవాఙ్మయమునకు నిస్తులమైన సేవచేసినారు. సంస్కృత ప్రమాణ గ్రంథముల నుండి ఉదాహరించి ఈ యపూర్వ వ్యాసమున ఈ క్రింది సిద్ధాంతములను ప్రతిపాదించిరి. (1) తెలుగుభాషలో, సంస్కృత భాషలోనున్నట్లును, ఇంగ్లీషువలెను, నాటకము ఎల్లవారి అందుబాటులోను ఉండవలెను; (2) ప్రాకృతభాషలు సజీవభాషలు, అట్లే సజీవమైన మాటలాడబడు తెలుగు, సామాన్యభాష, నాటకములలో ప్రయోగింపబడుట న్యాయము; (3) పాండిత్య సాహిత్యముల యనుకరణములుగా కృతక ప్రయోగములు సాక్షాత్తు వాస్తవ జీవిత చరిత్ర విషయములవలె హృదయ మునుతాకి, అణచిపెట్టరాని ఆనందసద్యఃస్ఫురణమునకు ఎంతమాత్రము తుల్యములుకావు, (4) మంచి నాటక రచయిత ఔచిత్యమును పోషించి రసమును ప్రజాహృదయములలో రేకెత్తింపవలెను. కాబట్టి ఈ ప్రధాన విషయము కొరకేమైనను, ఆంధ్రభాషాభిమాను లందరును ఈ పుస్తకమును చదువవలెను. ఇందు సంస్కృతాంధ్రాంగ్ల గ్రంథమునుండియు సుప్రసిద్ధ రచయితలైన మానియర్ విలియమ్సు, విల్సన్, వీబర్, ప్రొఫెసర్ కోవెల్, దత్, హృషీకేశశాస్త్రి మున్నగువారి రచనల నుండియు అనేక ప్రమాణము లుదాహరింపబడియున్నవి."

క్రీ. శ. 1900 తో ఆంధ్రదేశ వాఙ్మయ చరిత్ర యందును వేంకటరాయ శాస్త్రిగారి జీవిత చరిత్రయందును ఒక మహా ఘట్టము ముగియుచున్నది. ఒక గొప్ప మార్పు స్పష్టముగా కనబడుచున్నది. దిగ్గంతులవంటి పండితుల వాదోపవాదముల పోరాటములు అంతరించినవి. వాఙ్మయరంగమందలి విజయముచేత శాస్త్రిగారికి ఆనంద మనోవికాసములు గలిగినవి. కాని దాటరాని విధియొక్క వింత చేష్టలు వారికి మనోవైకల్యమును వెనువెంటనే కలిగించినవి. 1900 లోనే, వారి తండ్రిగారు, 83 ఏండ్ల వార్ధక్యములోనే యైనను గతించుట ఒకదెబ్బ. ఆ మరుసటి సంవత్సరమే, 1901 లో, వారి యాప్తమిత్రు న ప్రొఫెసర్, శ్రీ తాత వెళ్లమిరాదార్ శేషగిరిశాస్త్రిగారు ఆకస్మికముగా గతించిరి. తామిరువురును కలసి చేయదలచుకొని యుండిన

యొక వాఙ్మయ ప్రణాళికను వేంకటరాయశాస్త్రిగారు మానుకొనిరి. ఈ రెండు మహాదుఃఖములను ఎట్లో తట్టుకొని శాస్త్రిగారు 1902 లో కాళిదాస మేఘసందేశమునకు మల్లినాథసూరియొక్క సంజీవనీ వ్యాఖ్యకు చేటికగా పదప్రయోజనిక యనెడు వాఖ్యను రచించి ప్రకటించిరి. అది, చిరకాలముగా వారు పాఠము చెప్పుటకు వ్రాసియుంచుకొనియుండిన 'నోట్సు'. అందులో కాళిదాసు ఏపదమును ఏ ప్రయోజనముతో ప్రయోగించినాడో దాని సొబగును, కాళిదాసు యొక్క కవితామహిమను చక్కగా విశదీకరించినారు.

1904 లో, శాస్త్రిగారు తాము వ్రాసిన రెండవ స్వతంత్ర నాటకమును ఉషాపరిణయమును శృంగార సంగీత నాటకమును, పాత్రోచిత భాష ధారాళముగా ప్రయోగించి,సంస్కృత నాటికల భాణిలో వ్రాసి ప్రకటించినారు. ఇందలి కథ భాగవత హరివంశములలోనిది, యక్షగాన రచయితలకు చాల ప్రియమైనది. బాణుడను అసురుడు దేవతలను బాధించుచుండెను. అంతట దేవతలందఱును శ్రీమన్నారాయణుని ఆశ్రయించిరి. బాణునికిని భగవన్నారాయణావతారమైన శ్రీకృష్ణునికిని సంఘర్షణ కలుగునట్లు ఒక పన్నాగము పన్నిరి. కలలో శ్రీకృష్ణపౌత్రుడు అనిరుద్ధుడు, బాణాసురుని కూతురు ఉషను కలసి ప్రేమించును. అట్లే ఉషయు కలలో అనిరుద్ధుని కలియును. ఉషయొక్క స్నేహితురాలు చిత్రలేఖ తన దివ్యమహిమ చేత, శ్రీకృష్ణుని అంతఃపురమునుండి అనిరుద్ధుని తీసికొనిపోయి, బాణాసురుని అంతఃపురములోని ఉషతో కలుపును. బాణునికి ఈ విషయము తెలిసి, బాణుడు ఉషానిరుద్ధులను పట్టి వేర్వేరు ద్వీపములలో ఖైదులో పెట్టును. తన మనుమని విడిపించుటకు శ్రీకృష్ణుడు బాణునిమీదికి ఎత్తిపోయి అతని శిక్షించి, ఉషానిరుద్ధులను కలుపును. దేవతలకు బాణునిబాధ తప్పును. శాస్త్రిగారు సంస్కృత నాటక లక్షణములను పూర్తిగా అనుసరించుచునే, సంప్రదాయమునకు విరోధము రానీయక పెక్కు ఆధునిక పద్ధతుల ననుసరించిరి. పద్యరచనలో అల్లసాని పెద్దన, బట్టుమూర్తి మున్నగువారి కావ్య శైలిని అనుసరించుచునే, నాటకోచితమైన సులభ సంభాషణ శైలిని సాధించి నారు. శృంగార రసమును పోషించు సందర్భమున కావ్య వర్ణనల మార్గమును చక్కగా అనుకరించినారు. ప్రతాపరుద్రీయ నాటకమును పాఠ్యముగా నిర్ణయించుటకు సందేహించుచుండిన విశ్వవిద్యాలయము దీనిని వెంటనే బి.ఎ. తరగతికి పాఠ్యముగా నిర్ణయించినది. దీనిని సంస్కృతము లోనికి అనువదించిన యెడల ఇది రత్నావళీ, ప్రియదర్శికా, స్వప్నవాసవదత్తా మాళవికాగ్ని మిత్రములకు తుల్యముగా నుండును. దీనిని శాస్త్రిగారు తమ మిత్రులు శ్రీ ఆచార్య శేషగిరిశాస్త్రి గారికి అంకితము గావించిరి.

## 4. ముద్రణాలయమును మరల ప్రారంభించుట

వేంకటరాయశాస్త్రిగారు 1909 లో, మదరాసు క్రైస్తవ కళాశాలనుండి విశ్రాంతినందుటకు కొన్ని నెలల ముందు, మరల ముద్రాక్షరశాలను ప్రారంభించి, సంస్కృతాంధ్ర గ్రంథములను వరుసపెట్టి ముద్రింపసాగిరి. ఆ కాలములో సంస్కృత పఠనాశక్తికి పునరుజ్జీవము కలిగి, ఆంగ్లవిద్యాధికు లెందరో సంస్కృతము యొక్క పఠనావశ్యకతను గ్రహించిరి. కాని ఇటువంటి క్రొత్తరకపు విద్యార్థులకు తగిన ఉపాధ్యాయులు, శిష్యుల మనస్తత్వ ములకు సర్దుకొనువారు, దొరకుట దుర్ఘటముగా నుండెను. సొంతముగా కూర్చుండి చదువుకొనుటకు తగిన మార్గోపదేశికలవంటి పుస్తకములును లేకుండెను. మన భారతీయ సంస్కృతిని చక్కగా తెలిసికొనుటకు సంస్కృత భాషా పరిజ్ఞాన మావశ్యకమని నొక్కి చెప్పుచు, మనము, దాని స్వస్థలములోనే చారిత్రక కారణములచేత, చక్కగా చదువక ఉపేక్ష చేయుచుండగా, పాశ్చాత్య దేశాలలో దానికి ఆదరము హెచ్చిన విషయమును తెలిపి, మన వారు స్వయముగా, తరగతుల ప్రకారము మెట్టుమెట్టుగా, సంస్కృత మభ్య సించుట కొక ప్రణాళికను తయారుచేసిరి. ఈ పద్ధతిలో వచన శ్లోక గ్రంథములను తెలుగు టీకాతాత్పర్య విశేష వ్యాఖ్యలతో, తెలుగులిపిలో ముద్రించిరి. ఈ ప్రచురణములు ఎవరైనను, ఎప్పుడైనను, ఏయుద్యోగములో నుండినను, వారికి సంస్కృతము ఏ మాత్రము వచ్చియుండినను రాక పోయినను, స్వయముగా, ఉపాధ్యాయుని సహాయము లేకయే, అభ్యసించుటకు అనుకూలముగా నుండినవి.

1890 లో, మొదట, ముద్రాక్షరశాలను ప్రారంభించి, భోజచరిత్ర విక్రమార్కచరిత్రలను జేబు సైజులో వివరణముతో ముద్రించినప్పుడే ఈ ప్రణాళిక వారి హృదయముననుండెను. ఇప్పుడు విశ్రాంతి పుచ్చుకొన్న తర్వాత ఆ కార్యమును నిరంతరాయముగా కొనసాగించుటకు వారికి అవకాశము దొరకినది. వీని నిప్పుడు పెద్ద సైజులో మరల ముద్రించుచు ఎక్కువ టీక, ప్రత్యేకాంధ్రానువాదము ఇత్యాదులు చేర్చిరి. 1910 నుండి అచ్చుపీను, చక్కగా, కొంతకాలము జరిగినది. కాళిదాస రఘువంశ కుమార సంభవములలో మొదటి 6 సర్గలకు మాత్రము టీకా తాత్పర్యములు వ్రాసి మల్లినాథ వ్యాఖ్యతో కలిపి ప్రకటించిరి. అమరకోశమును, శబ్దమంజరీ ధాతుమంజరులను చేర్చి, ఆంగ్లములో హెన్రీగారి ల్యాటిను వ్యాకరణము పద్ధతిలో పాశ్చాత్యులు సంస్కృతమును సులువుగా చదువుకొనుటకు

అనుకూలముగా ప్రకటింపబడినదే, సమాసకుసుమావళి సంస్కృత సమాసములను వివరించునది. నిఘంటు పాఠము చేయు భారతీయ సంప్రదాయము చాలవఱకు కాలమును కూడుదలగా సంక్షిప్తపరచునది కాబట్టి ఆ పద్ధతినే శాస్త్రిగారు ప్రతిపాదించిరి. వీనిని చదువుటచేత విద్యార్థులకు ఒక పాటి అర్థజ్ఞానము కలిగి శ్లోకముల భావమును గ్రహించు శక్తి కలుగును గాన బిల్హణీయమును, తర్వాత శృంగారకావ్యములను చదువుకొనుటకు పనికి వచ్చునట్టి పీఠికగా, టీకా తాత్పర్యములతో ముద్రించిరి. మేఘసందేశము విపులటీకతో, కాళిదాసు హృదయమును గ్రహించుటకు పనికి వచ్చునట్లుగా ముందే ప్రకటింపబడినది. తర్వాతి ప్రచురణము భర్తృహరి శతకత్రయము తెలుగు టీకాతాత్పర్యములు, సంస్కృత వ్యాఖ్య, తెలుగు కవుల పద్యములు వీనితో ముద్రించిరి. ఆంధ్రానువాదకులకు తులనాత్మక పరిశోధకులకు ఇది అత్యంతోపయోగకరము. హితోపదేశ దశకుమార చరిత్రలకు వట్టి ఆంధ్రానువాదములు మాత్రము ప్రకటించినారు. ఈ విధముగా స్వయంగ్రాహియగు విద్యార్థిని మెట్టు మెట్టుగా పైకి తెచ్చి, స్వయముగా ఏ సంస్కృత గ్రంథమునైనను చదివి అర్థము గ్రహించు దశకు తెచ్చి, అందులకు అనుగుణముగా పంచతంత్రము మూలము మాత్రము ముద్రించినారు. సంస్కృత నాటక పఠనమునకు మార్గదర్శకముగా ప్రియదర్శికా నాటికను ప్రతిపదార్థముతో ముద్రించుటయే గాక, ఆంధ్రానువాదమును కూడ ఇచ్చి, నాటక లక్షణమును, పర్యాయ పదములను వివరించినారు. విద్యార్థుల యనుకూలమునకుగాను, ప్రతి పుటలోను, ఒక వైపు నగములో సంస్కృత మూలము (తెలుగు, లిపిలోనే) రెండవ నగములో ఆంధ్రానువాదము, అధోభాగమున టీకా తాత్పర్య వివరణములు వచ్చునట్లు ముద్రించినారు. ఈ నాటికకే, తెలుగు ప్రత్యేకాంధ్రానువాదము విశ్వవిద్యాలయములలో పఠనార్థము రచించి ప్రకటించినారు.

శాస్త్రిగారి సంస్కృత నాటకానువాద పద్ధతిని గుఱించి ఒకపాటి వివరింపవలెను. వారి నాగానంద శాకుంత లాంధ్రీకరణములు రంగ ప్రయోగమునకును ప్రత్యేక పఠనమునకును కూడ పనికి వచ్చునట్లు వ్రాయబడినవి. భాషా విధానము, పద్యములను మూలమందలి ఆయా వివిధ వృత్తములలో వ్రాయుట, రంగమందు నాటకము రక్తి కట్టుట కుపయోగపడినవి. అనువాద పద్ధతి మూలమునకు చాల చేర్పుగా నుండుటచేత, విద్యార్థులు పోల్చి చదివి సంస్కృత భాషలోని శబ్దార్థ భావార్థములనే గాక వాని అంతరార్థమును కూడ గ్రహించుట కుపయోగపడినది. తెలుగులోని తొలి తొలి యనువాదములు, నన్నయ తిక్కనాదుల ఇతిహాస పురాణాదులవి, మూలమునందలి భావములను

గ్రహించి ఒకపాటి స్వాతంత్ర్యముతో చేయబడినవి. అందులోను మూలములో అధికమని తోచిన చోటులలో తగ్గించుటయో, తక్కువయని తోచిన వివరించుటయో జరిగినది. తర్వాతి మధ్యకాలపు అనువాదములు కూడ ఇదే పద్ధతిని అనుసరించినను కొంత స్వాతంత్ర్యమును వహించినవి. ప్రబంధ యుగమునకు వచ్చునప్పటికి అనువాద విధము పోయి కవుల కల్పనా శక్తికి ధారాళమైన అవకాశము దొరకినది. ఆధునిక రచయితలు నాటకానువాదములకు ప్రారంభింపగానే మూలములకు చాల చేర్పుగా నుండవలసి వచ్చినది. ఇందువలన శ్రమ యెక్కువయైనది. మూలార్థమును లోతుగా చదివి గ్రహించి సంస్కృత నాటకముయొక్క అంతరార్థమును గ్రహించుటయేగాక తెలుగులో రచనా నైపుణ్యముకూడ ఎక్కువ కావలసి వచ్చినది. వేంకటరాయశాస్త్రిగారు, మదరాసు క్రైస్తవ కళాశాలా పత్రిక చెప్పినట్లు, మూలమును, ఏమాత్రము అతిక్రమింపని అనువాదములో దక్షులు. సంస్కృత మూలములలో ప్రదర్శితములైన గుణములు, వ్యాఖ్యాత ప్రదర్శించునట్లు, ఆయా గుణ విశేషములను – సామాన్యార్థము, అంతరార్థము, అలంకారములు శబ్దచమత్కారములు, పద్య ఛందస్సుల సొంపు, యమకాదికముల తీరు, మానసిక తత్వార్థము – ఇవన్నియు శాస్త్రిగారి యనువాదములో వచ్చినవి, ఇందువలన వారి యనువాదము మూలముకన్న కఠినముగా కనబడును. కాని వాఙ్మయ రచనా పరిశ్రమయందు ఇది యొక గొప్ప సాధన. ఇది శాస్త్రిగారికి చక్కని మూలానుసారియను ప్రతిష్ఠను సంపాదించి పెట్టినవి. మూలమునకు ఆశ్చర్యకరమైన సామీప్యమును సాధించుటయేగాక ఆయనువాదములను ప్రత్యేక స్వతంత్రరచనలవలె సాధించినారు. మఱియొక విషయము చెప్పవలసినది యేదనగా వారు అనువదించుటకు ముందు ఆయా మూల గ్రంథములకు గల తాళపత్ర ప్రతులను, ముద్రణములను, వ్యాఖ్యలను చూచి సరియైన పాఠములను, అనువదించుటకు ముందు నిర్ణయించుకొందురు. దీనికి కూడ ప్రత్యేక పాండిత్యము ఆవశ్యకమే, వాఙ్మయ రంగములో వీరేశలింగము పంతులు, నరసయ్యశాస్త్రివంటి అనువక్తలుండిరి. కాని, వారు ఈవిధముగా మూలమును అనుసరించుటకు ప్రయత్నింపలేదు. చదువరులకు సులభముగా నుండవలెనని ప్రయత్నించిరి. అందువలన వారి యనువాదములు సంస్కృత మూలముతో పోల్చి విమర్శించి చదివి పరిశోధింప దలచిన వారికి నిరుపయోగములైనవి.

సంస్కృత విద్యలో తర్వాతి మెట్టు కావ్యాలంకారశాస్త్రము, వాఙ్మయమునకు సంబంధించినది: రస భావములను గుఱించి కావలసిన వారికి అమరుకావ్య రసమంజరులను టీకాతాత్పర్యములతో ప్రకటించిరి. అమరుకావ్యమే అమరుశతకము. రసమంజరి భానుసూరి ప్రణీతము.

సంస్కృతమందలి నాయికానాయకుల జాతులు, గుణములు, మున్నగు వానిని తెలుపును. అటు తర్వాత బాలకాలమునకు వీరు సంస్కృతములో విశ్వనాథకవిరాజు వ్రాసిన సాహిత్యదర్పణమును అనువదించిరి. (ఇది వారి మరణానంతరము ప్రకటింపబడినది.) తర్వాత వారు పుష్పబాణ విలాసమును టీకా తాత్పర్యముతో ప్రకటించిరి. జీవితములోని ఒడుదొడుకుల వలన వీని నన్నిటిని ఒక్క మొగిని ప్రకటింపలేకపోయిరి. జీవితము వారికి అంత సులువుగా జరుగలేదు. 1919 సం॥ తర్వాత ముద్రాక్షరశాలను వారు విక్రయింపవలసి వచ్చినది. దాదాపు డెబ్బదియేండ్లకు సమీపించినది వయస్సు, రచన ఎంతో మిగిలియున్నది. కాళిదాస శ్రీహర్షుల నాటకాను వాదములు పూర్తి చేయవలసియుండినది. అందులకు మాళవికాగ్నిమిత్ర, విక్రమోర్వశీయ, రత్నావళులను ఆంధ్రీకరించిరి. భవభూతి యొక్క ఉత్తరరామచరిత్రను ఆంధ్రీకరించిరి. ఇందలి విశేష మేమనగా భవ భూతి యొక్క నాటకములన్నిటిమీదను అతి విస్తృతమైన పీఠికను చేర్చి ప్రకటించుట. వారి నాటకవిమర్శ గమనింపదగినది. రస సిద్ధాంతము చేసి ఇది కరుణము గాదనియు, కరుణ విప్రలంభమనియు చాల సూక్ష్మముగా వివరించి నిర్ణయము చేసినారు. వారి భారతాభారతరూపకమర్యాద లను వ్యాసము సంస్కృతనాటకముల ప్రారంభచరిత్రనేగాక, నాటక కర్తగా, అనువాదకుడుగా, దర్శకుడుగా, ప్రయోక్తగా వారి యనుభవమును కూడ విశదీకరించుచున్నది.

1 - 4 - 1936 లో **The Federated India of Madras** పత్రిక వేంకటరాయశాస్త్రిగారి సాహిత్య దర్పణాంధ్రీకరణమును సమీక్షించు ఇట్లు నుడివెను — ఇది విశ్వనాథకవిరాజుయొక్క సుప్రసిద్ధ ఆలంకారిక రచనకు ఆంధ్రపండితులలో రాజ శ్రేష్ఠుడైన వేంకటరాయశాస్త్రి యొక్క ఆంధ్రానువాదము. విశ్వనాథకవిరాజు 14 వ శతాబ్దపు వంగీయ (సరిగా చూచిన ఓఢ్ర) పండితుడు. సంస్కృతాలంకారికులలో పరమోచ్చస్థానము గలవాడు. దీనిని ఆంధ్రీకరించుటచేత వేంకటరాయశాస్త్రిగారు ఆంధ్రులకు మహూపకారమొనర్చిరి. . . . . . ఇది తెలుగు పండితులకుగల యొక పెద్ద అక్కరను తీర్చుచున్నది. తెలుగుభాష భావ రసాదులలోను పదజాలము లోను సంస్కృత భూయిష్ఠమై యున్నందువలన తెలుగు కవులును పండితు లును తమ సూత్రములను సంస్కృత లాక్షణికుల నుండియే గ్రహించిరి. అందువలన ఆంధ్ర వాఙ్మయ స్వభావమును గ్రహింపగోరు విద్యార్థి అలం కారశాస్త్రమును సంస్కృతమునుండియే గ్రహింపవలసి యుండెను. తెలుగులో కావ్యాలంకార గ్రంథములు చాల తక్కువ, కావ్యాలంకార చూడామణివంటి సుప్రసిద్ధ పుస్తకములు వాస్తవముగా అసంపూర్ణములును, అటనట దుష

ములును. అందువలన సంస్కృతముమీదనే ఆధారపడవలసిన అవసరము కలిగినది. ఇది నేటి సామాన్యతెలుగువిద్యార్థికి సాధ్యముకాదు. అట్టివారికిని సామాన్య విద్యావంతులకును, ప్రస్తుత ముపలభ్యమైన అనువాదముల వంటివి చాల అనుకూలములు, అటువంటివి ఎక్కువకూడ లేవు. మమ్మటుని కావ్యప్రకాశిక, క్రీ. శే. శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారిచేత కొన్ని సంవత్సరముల క్రింద కాబోలు అనువాదము చేయబడినట్లు తోచుచున్నది. ఆంధ్రసాహిత్యదర్పణము ఇప్పుడు ప్రకటింపబడినది, ఇటువంటి అపూర్వములును అత్యుపయుక్తములునైన గ్రంథములలో చేర్పవచ్చును.

ఈయనువాదమునుగూర్చి ఎంతో చెప్పవలసియున్నది. వేంకటరాయ శాస్త్రిగారికి గొప్ప పాండిత్యముతోపాటు అతి సులభశైలికిని పెట్టినది పేరు. ఈ పుస్తకములో ఈరెండు గుణములును ఎంతో చక్కగా కుదిరినవి. మూల శ్లోకము సులువైన వచన వివరణముగా నాంధ్రీకరింపబడినది. అందువలన, విషయముఃతెలియక మొదలుపెట్టువారు కూడ సులువుగా గ్రహింపగలరు.

శాస్త్రిగారు ఎన్నో ప్రచురణములు వెలువరించిన ఈ కాలములో (1909 - 1913) వారి తెలుగు ప్రచురణములలో చెప్పదగిన కావ్యములు పారిజాతాపహరణము, బిల్హణీయము, కావ్యాలంకారచూడామణి, హరిశ్చంద్ర ద్విపద, సారంగధర చరిత్ర ద్విపద, కొద్దిటీకతో సుప్రసిద్ధ తంజాపురకవి చేమకూర వేంకటరాజుయొక్క విజయవిలాసము సారంగధరచరిత్రలు. 1913 లో, మహాకవి శ్రీనాథుని శృంగారనైషధమునకు, చిరస్థాయియైన సర్వంకష వ్యాఖ్యనుప్రకటించిరి. ఈ శృంగారనైషధము, సంస్కృతములో, పండ్రెండవ శతాబ్దివాడైన శ్రీహర్షపండితుడు వ్రాసిన నైషధీయచరిత్రకు ఆంధ్రానువాదము. తెలుగులో వ్యాఖ్యాతగా శాస్త్రిగారిని గురించి ఎంతో చెప్పవలసియున్నదిగాన దీనిని గురించి మరియొక ప్రకరణములో చెప్ప దలచితిని. ఈ కాలములో శాస్త్రిగారి కార్యక్రమములు బహుముఖములు. ఇప్పుడే వీరు పెక్కు వాఙ్మయ సంస్థలతో కలసి పనిచేసిరి. ఆంధ్రసాహిత్య పరిషత్తుకు కొంతకాలము కార్యదర్శిగా నుండిరి. గురుజాడ అప్పారావు గారును గిడుగు రామమూర్తి పంతులుగారును ప్రారంభించిన వ్యావహారిక వాదముయొక్క ప్రతిపక్షులకు నాయకత్వము వహించిరి. రెండేండ్లు సూర్య రాయాంధ్ర నిఘంటువునకు ప్రధాన సంపాదకులుగా నుండిరి. నెల్లూరిలోని ఆంధ్రభాషాభిమాని సమాజమునకు అధ్యక్షులుగానుండి (వారు తమ నాటకములనే ఆడువారుగాన) వారిచేత ఆడించుచు నుండెడువారు.

## 7. గ్రాంథిక వ్యావహారిక భాషావివాదములు

ప్రపంచములో ఏదేశములోగాని దాని లిఖితభాష, ఆదేశపు దైనందిన వ్యావహారికభాషగా అనుభవములో లేదు. జనులు మాటలాడుకొను భాషకును వారు వ్రాసికొను భాషకును అనుభవములో చాల భేదమున్నది. ఒకవేళ ఇంగ్లీషు భాష వారి జనసామాన్య భాషకు చాల చేర్పుగా నుండునేమో. గాని పూర్తిగా రెండును ఒకటిగావు; మాటలాడు భాషకు కొంతభిన్నమే చదువుకొన్నవారు ఒకవిధమైన సలక్షణ భాషను మాటలాడుట వాస్తవమేగాని చదువురాని అశేషజనము పైతరగతులవారి భాషను లక్ష్యపెట్టరు. వారికి పారంపర్యముగా ఒక గ్రామ్యము ఉండనేయుండును. అన్ని ఖండములలోను దేశములలోను ఇదే పరిస్థితి. మన భారతదేశములోను అంతే. ఇచ్చట చారిత్రక కారణములచేత లెక్కలేని వ్యావహారిక భాషలు (dialects) ఏర్పడినవి. మహమ్మదీయులు వచ్చువఱకు, సంస్కృతము, చదువుకొన్న వారి వ్యవహారభాషగానుండి అటుతర్వాత పర్షియన్ (పార్సీ) రాజభాష యైనది. చాలమంది హిందువులు పార్సీభాషను, సైనికుల వ్యావహారిక భాషయైన ఉర్దూభాషను నేర్చుకొనిరి. ప్రాంతీయ భాషలుకూడ వృద్ధినందినవి. కాని మాటలాడుకొను వ్యావహారిక భాషలలో ఎటువంటి మార్పులు వచ్చినవనగా, వానిలోకూడ మాటలాడుదానికిని వ్రాసికొనుదానికిని సంబంధము లేనంతటి మార్పు కలిగినది.

ఆంధ్రదేశములో ఒకప్పుడు ప్రాకృతమును సంస్కృతమును ప్రధాన భాషలుగా నుండినట్టిచోట తెలుగు రాజకీయభాష యైనది. కవులు చాల కాలమువఱకు పద్యములే వ్రాయుచుండినందువలన వచనము, అను దినవ్యవహారములో, అనగా శాసనములలో, వ్రాయబడుచుండినట్టిది కావ్యములవచనము కన్న చాల మారిపోయినది. ఇంతకుముందు నేను వ్రాసినట్లు, పదునెనిమిదవ శతాబ్దము నాటి వచనము కూడ కావ్యశైలి యందే గదా యుండినది. చిన్నయసూరి నీతిచంద్రికను వ్రాసినదిమొదలు రచయితలలో, ప్రాచీనకావ్య వచనమునుండి పైతరగతుల వారి వ్యావహారికమునకు చేర్పైన వచనమును అఖిలాంధ్ర దేశమునకును సమ ప్రామాణ్యము గల భాషలో వ్రాయుట ప్రారంభమైనది. క్రమముగా కొన్ని పాత పద్ధతులు అంతరించి వానికి బదులు కొన్ని మామూలు సులభతర పదములు ఆదరింపబడ సాగినవి. క్రొత్తలక్షణము - పూర్ణానుస్వారము

స్థానమున అర్ధానుస్వారమును ప్రయోగించుట. ఈ పూర్ణానుస్వార మొకప్పుడు పూర్తిగా ఉచ్చరింపబడుచుండి తర్వాత ఉచ్చారణలో పోయి వ్రాతలో నిలిచియుండినది.

రేఫములలో లఘురేఫ శకటరేఫములు కలవు. బండి యొక్క రెండు చక్రములవలె వ్రాయబడుట చేత ఆ పేరు. ఈ శకటరేఫము ద్రావిడ భాషా జన్యము. తెలుగు పదములలోనే కనబడును. దీనికి తుల్యప్రయోగములు కన్నడములోను తమిళములోను కనబడును. రెండు రేఫముల యుచ్చారణయు సంస్కృత రకారము వలెనే యుండును. ఈ అర్ధానుస్వార శకటరేఫములు రెండును నేటి వర్ధమాన కవులకును రచయితలకును పండితులకును అడ్డు గడియలైనవి. కాని ఎవరికిని సంప్రదాయ విరుద్ధముగా ప్రవర్తించుపాటి ధైర్యములేక పోయినది. పైగా మఱియొక పెద్దసమస్య, పదములలో వాక్యములలో సంధికలిపి వ్రాయుట. చక్కని వాక్యరచనకు దీని జ్ఞానము చాల ముఖ్యము.

ఈ విషయములు చాలమంది పండితులు గ్రహించిరి. వేంకటరాయ శాస్త్రిగారు కూడ. అందరికిని గోచరించిన తర్వాత కాదు వీరు గ్రహించినది. భాషను సులువు పఱచి, రచనలో శ్రమ తొలగించుటకును, డొంకతిరుగుడు చిక్కు పదబంధములు రాకుండ చేయుటకును వారు విసంధిని ప్రతి పాదించిరి. దీనికి సంస్కృత వ్యాకరణ శాస్త్రములో గతి కలదని వారు గ్రహించి చూపిరి. కాని ఈ పద్ధతి అతి తీవ్రవాదులకు సరిపడలేదు. అన్ని రచనలును మామూలు మాటలాడు భాషలో వ్రాయవలెననెడు విప్లవాత్మక సంస్కారమును వారు కోరసాగిరి. కన్యాశుల్కరచయితయైన శ్రీగురుజాడ అప్పారావుగారు ఈ వ్యావహారికవాదమును ప్రతిపాదింపగా శ్రీగిడుగు రామమూర్తి పంతులుగారు వెను వెంటనే ఆ మార్గము నవలంబించిరి. కన్యా శుల్కము 1897 లోనే (ప్రతాపరుద్రీయము వెలువడిన సంవత్సరమే) ప్రకటింపబడినను, ఆకాలమున వ్యావహారిక బాషకు ఉద్యమము ఏదియు లేదు. 1911-12 లో కన్యాశుల్కమును పునర్ముద్రించుటతో ఈ ఉద్యమము ప్రారంభమైనది. తాతగారు ఔచిత్యము కారణముగా నాటకములలో చాల విధములైన గ్రామ్యములను, పట్టుదలతో ప్రయోగించినట్టివారు, ఈ వ్యావహారికమునకు, ప్రయోగమునకు తగిన ప్రామాణికత లేదనియు, చక్కగా చదువుకొనిన శిష్టులే ఒక విధముగా గాక జిల్లా జిల్లాలలోను విధ విధములుగా మాటలాడుచున్నారనియు, కాబట్టి ఇది బొత్తిగా పనికి రాదనియు నిషేధించిరి. పైగా, ఇందువలన, భాష దిగజారి, రాజరాజ నరేంద్ర శ్రీకృష్ణదేవరాయ, రఘునాథరాయాదుల నాటి కావ్య వాఙ్మయము జనులచేత పూర్తిగా ఉపేక్షింపబడి అంతరించిపోవునేమో

యని వారు భయపడిరి. 1912 లో నిడుదవోలులో జరిగిన యొక సమావేశములో తాతగారు, తమ యుద్దేశమును చాలవిరివిగా వివరించి, ఆంధ్రదేశమందలి వివిధ ప్రాంతములందలి గ్రామ్యభాషలలోని వైవిధ్యమును వర్ణించిరి.

జూను నెల 2వ తేది, 1912 సం॥ శ్రీ జి. వి. అప్పారావుగారు తాతగారికిట్లు వ్రాసిరి.

"పూజ్య ప్రియమిత్రులకు —

మదరాసు సమావేశములో మీరు నాతో చెప్పినది - నా యభిప్రాయములలోని కొన్ని యంశములలో తప్ప చాలవరకు నా భావములు మీకు అంగీకార్యములుగానే యున్నవన్నది — నాకు ఎంతో ఆనందమును కలిగించినవి. వచనరచనలోని శైలీప్రక్రియను గుఱించి (మనకు) అభిప్రాయభేదములుండినను ప్రామాణికాధారముల విషయములలో మనకు అభిప్రాయభేదములకు బొత్తిగా అవకాశము లేదు. మనకు మూలాధారము లొకటే. అందువలననే నాకు మీరన్న గౌరవము. మీరు ఏ విషయమును గుఱించి ప్రసంగించినను విషయము కూలంకషసమగ్రతను పొంది యుండును. మామూలుగా అందఱు పండితులను గుఱించి నాకు ఇట్టి అభిప్రాయములేదు. వారి యభిప్రాయములు, ముఖ్యముగా, వారి మానసికాభిమానములే గాని, వారు సంస్కృతసంప్రదాయమును పరిశోధించుటకు పాటుపడరు. దేశమాత (అను .... వారి పత్రిక) లో ఒక వ్యాసము చదివి నాకు నవ్వు వచ్చినది. దాని భావమును ఆంగ్లమున వ్రాయుచున్నాను. (జాబు ఆంగ్లములోనే వ్రాయబడినది) - 'ఒకరిద్దరు నాటకములలో గ్రామ్యమును వాడుటకు ప్రతిపాదించిరి. కాని పండితులు దానిని ఖండించిరి' అని. ఎక్కడ ఉన్నారీపండితులు ? వారిని నేను చూడగోరుచున్నాను. పచ్చయప్పకళాశాలలో సమావేశమైన వారిలో ఎందరు ఆ పేరునకు తగినవారో నాకు చూడ వింతగానున్నది.

నిడుదవోలుసమావేశములో మీరు చాలసేపు మాటలాడినారట. మీరేది చెప్పినారో నేను తెలిసికొనగోరుచున్నాను. లేదా మీ వాద సారాంశము. మీ తీర్మానములు మీ యుపన్యాసములు మదరాసు పత్రికలు ప్రచురింపకపోవుట శోచనీయము. ఆంధ్రప్రకాశిక మాత్రము, మీరు పాల్గొన్న, సంధిని గుఱించిన సమావేశము మీద, నొక నివేదికను ప్రకటించినది. అందులో మీ అభిప్రాయములమీద వ్రాసిన ఒకటి రెండు వాక్యములు, అదేదో నా కర్థముకాని తెలుగులోనున్నవి. మీ నిడుదవోలు ఉపన్యాసముగాని, దాని సారాంశముగాని, మీరేదైన తెలుగు వారపత్రికలో ప్రకటించినయెడల మీకు కృతజ్ఞుడను. ఆర్యా, దయయుంచి నా కొఱకును,

తెలుగుభాష కొఱకును, మీ యభిప్రాయము లేవో, ఎంతవఱకు మనకు ఏకీభావమున్నదో, ఎక్కడ అభిప్రాయ భేదమున్నదో వ్రాయ ప్రార్థన.

మీ హార్దిక
జి. వి. అప్పారావు.

(P.S.) పూజ్యమిత్రమా, ఈ యుదయము వ్రాసిన జాబునకు తర్వాత మరల వ్రాయుచున్నాను. ఈ కాలపు వచనరచనలలోను పద్య కావ్యములలోను మీకు అంగీకార్యములైనవేవి. వేనిని చదువుమందురు. ప్రామాణికముగా (standard) వచనమునకు మీ కథాసరిత్సాగరమును. పద్యములకు మీ నాటక పద్యములను గ్రహింపవచ్చునా ?

ప్రాచీనకవుల పద్ధతులనుండి మీరెంతవఱకు మారినారు. సాధుత్వ నిర్ణయమునకు మీకేది పరీక్షామార్గము. వచన రచయితలలో ఒక సామాన్య సాధుత్వ ప్రామాణిక రచన చేయించుట సాధ్యమా, ఆచరణ యోగ్యమా? తెలుగు వచనమునకు వీరేశలింగముపంతులుగారు చూపిన పద్ధతి మీద మీ యభిప్రాయమేమి? ఆయన అనుయాయులందఱును తమలో, ఎక్కువ తక్కువలులేని, సమాన ప్రామాణిక సుబోధభాషలో వ్రాయుచున్నారా ? గ్రాంధిక సంప్రదాయమునకు అలవాటుపడిన పండితులకు మాటలాడు గ్రామ్యభాషలో వ్రాయుట పేలవముగానుండిన, వీరేశలింగముగారి నాయకత్వమున నేటి రచయితలు వ్రాయు జనసామాన్య వచనము పండితులకును అంగ్ల విద్యాపారంగతులకును ఔచిత్యదూరముగాదా.

మీ హార్దిక
జి. వి. అప్పారావు.

12 జూన్ 1912 తారీఖుగల యొక జాబులో ఇట్లు అప్పారావుగారు వ్రాసినారు.

"తమ 9 వ తారీఖు జాబునకు నా వందనములు స్వీకరింప ప్రార్దన. మీ కథాసరిత్సాగర ప్రథమ ముద్రణప్రతి నా యింటియొద్దనున్నది. మీ ద్వితీయ ముద్రణము వెలువడగానే వి. పి. పి. ద్వారా పంపవలసినదని మీ పుస్తక ప్రకాశకులకు చెప్పుడు. మీరు పంపెదమన్న మీ చిన్న పుస్తకము యొక్క మాదిరిప్రతి నాకింకను చేరలేదు.

మిమ్ము గుఱించి మీరు చెప్పుకొన్నదంతయు మీ సౌజన్యమును తెలుపుచున్నది. మనలో ఎవరుగాని ఒకజీవితకాలపు అలవాటులను, మానసికాభిమానములను, పూర్తిగా వదలిపెట్టలేము గదా. కాని మీ

వంటివారు, పాండిత్యముతో కూడ కవితాశక్తియు గలిగి, దూరదృష్టి దీర్ఘాలోచనలతోడి మౌలికభావ సంపన్నులు (original thinkers) మార్గ దర్శకులు, ఈ కాలపు, మారిన పరిస్థితులకు తగిన నూతన మార్గములను చూపి భాషను స్తబ్ధతనుండి రక్షింపవలెను. మీ రచనలన్నిటిని నేను చక్కగా చదువగోరుచున్నాను, మీ కవిత్వము ప్రాచీన కవుల వ్యాకరణ మర్యాదలోను శైలిలోను ఉన్నది. వచన రచనలో మీరు భిన్న మార్గమును త్రొక్కినారు, కాని నాకు అర్థముకాని దేమనగా పూర్తిగా మార్పులేని తీవ్ర ప్రాచీన పద్దతిలో వచనము వ్రాయుచు కవిత్వములో నీరసశైలి ననుసరించుచుండు వావిలి కొలను సుబ్బరావువంటివారితోను, వీరేశలింగముపద్ధతివారితోను ఏక మనస్కులై మీరెట్లు చేరగలరో నా కర్థమగుటలేదు. వ్యావహారిక భాషావాదులకన్న వీరివలననే ప్రాచీన కావ్యశైలికి ఎక్కుడు అపాయము. మీరు ప్రతిపాదించు కావ్యశైలికన్న ఎక్కువ ప్రచారములోనున్న వచనముయొక్క బాగోగులను పరిశీలించుట మీవంటి నాయకులకు విధియని నా యభిప్రాయము.

గ్రామ్యము మీది మీ చిన్న పుస్తకమును కుతూహలముతో ఎదురు చూచుచున్నాను .... నిడుదవోలునుండి మదరాసుకు చేసిన ప్రయాణపు బడలిక మీకు తీరినదని తలంచెదను.

మీ హార్దిక
జి. వి. అప్పారావు.

(P. S.) ఇప్పుడే మీ చిన్న పుస్తకము చేరినది. నా వందనములు. గ్రహింపుడు. నా వాదమునకు ఎదురు వాదమును చూడగోరితిని. మీ యాక్షేపములకు సమాధానములు వ్రాయుటకు ప్రయత్నించెదను. మనకు ప్రధాన ప్రమాణముల మీద అభిప్రాయభేదము లేదు గదా. మొన్నటి సమావేశములో నా అభిప్రాయములను నేను చక్కగా విశదీకరింపలేదేమో, నేను చేసిన ఆక్షేపణలకు మీ సమాధానములు చూడగా నా ఆక్షేపణలు నేను చేయని విధమున నున్నవి మీ సమాధానములు.

పెక్కు విషయములకు నేను మిమ్ము మెచ్చుకొనుచున్నాను. ముఖ్యముగా ప్రతాపరుద్రీయములో మీరు చూపిన భాషాతత్పరతకును దేశభక్తికిని, చారిత్రకవాతావరణము తోడి కథానిర్మాణమునకును. బహుశః ఆ కాలము కూడ, నేటి కాలమువలెనే, ఏకాలమునకు ఆ కాలమువలె, అస్వారస్యముగానే యుండినదేమో! కాని, మీరు పాత్రలను, సంస్థలను, ఆదర్శ ప్రాయముగా సృష్టించినారు. విమర్శకులమని చెప్పుకొనువారిలో దానిని గ్రహింపగల

వారు చాల కొద్దిమంది. తెలుగు విమర్శకులు వ్యాకరణ సాధుత్వమను బురదలోను కృతకకళ యనెడి చెదరిన రంగములో పడి పొరలాడు చున్నారు. మిమ్ము ఇంతగా కొనియాడుచు నేను మీతో వాదము చేయుటకు ఇష్టములేక చింతించుచున్నాను. కాని మావంటి వారికి గత్యంతరము లేని పరిస్థితి మీ వలననే ఏర్పడినది. అందువలన పాండవులు భీష్ముని ప్రార్థించినట్లు నేను మీ అనుమతిని కోరుచున్నాను. ఎంత స్వల్పాతి స్వల్పముగ మీకు నేను నమ్మకము గల్గింపగలిగినను దానికి మీ సాయమే కావలెను.

భక్తి నమ్రతతో మీ హార్దిక
జి. వి. అప్పారావు.

1914 జనవరి, 8 వ తారీఖున, కూనూరు నుండి యొక జాబులో నిట్లు వ్రాసినారు. – "మిమ్ము ఒక ప్రశ్న అడుగుచున్నాను. మీనాటకములలో ఔచిత్యము కారణముగా మీరు ఎన్నో తరగతుల గ్రామ్యములను ప్రయోగించినారుగదా. వానిలో ఉత్తమమైన దానిని, చదువుకొన్న బ్రాహ్మణుల భాషను ఏలమానినారు. దానికి ఎక్కడను ప్రయోజనము లేదా. సంఘములో ఒక మంచి స్థానమునందున్నవారి పాత్రలు, ఆ భాషను మాటలాడుటకు కూడ ఆ ఔచిత్యమే పనికిరాదా?"

ఈ జాబులకు ఎటువంటి సమాధానములు వచ్చినవో తెలియదు. వివరము అక్కరలేదుగాని ఇంత మాత్రము చెప్పిన చాలును. తాతగారు మాత్రము, ఆంధ్రదేశములో అందరకును సార్వజనీనమైన గ్రాంధికభాష యొక్క స్థానములో, విద్యావంతులైనవారి గ్రామ్యభాషను, దానికి దేశ పర్యాప్త ప్రామాణికత్వము (అందరికి సరిపోవు గుణము) లేకపోవుటచేత, ప్రయోగింపరా దనిరి. విశ్వవిద్యాలయములలోను, రాజ్యాంగములోను, ప్రామాణిక భాషను ఉన్నదియున్నట్లు ఉంచవలసినదే. ఎంత మాత్రము విద్యా విధానములో మార్పు తేరాదని, వ్యావహారికోద్యమమునకు ప్రతి ఉద్యమము కొనసాగించిరి. అందువలన అప్పారావుగారి ఉద్యమము కొనసాగలేదు. దేశములోని స్వతంత్రజనులు వీథులలోగాని, ఎచటగాని తమకు తోచిన భాషను ప్రయోగింపవచ్చును, వారికి స్వాతంత్ర్యమున్నది గాని విద్యావిషయకమైన సంస్థలు సలక్షణ భాషలో, ప్రాచీన కావ్య నాటకములనే బోధింపవలయునని తమ యభిప్రాయమును తెలిపిరి. మాటలాడుభాషకు ఉపాధ్యాయు డక్కరలేదు. దానికి ప్రామాణికత్వము కుదురదు. తమ యుపన్యాసములో, తర్వాత గ్రామ్యాదేశనిరసనమని ప్రకటింపబడిన దానిలో, భిన్నప్రాంతములలోని భాషాభేదములను శబ్దముల

అర్థభేదములను చక్కగాచూపి, ఒక ప్రాంతములో సదర్థమందు ప్రయోగింపబడినది మఱియొక ప్రాంతములో దుష్టముగాకూడ నుండునని విశదీకరించినారు. పైగా జనుల అజాగ్రత్తవలన శబ్దములు తారుమారై, రూపహానినంది ఒక్కొక్కరికి ఒక్కొక్కవిధముగా అర్థమగుచుండునుగాన, అత్యున్నత విద్యావంతులు మాటలాడు భాషకూడ చిన్నయసూరి కాలమునుండియు ఎంతో మార్పుజెంది మెఱుగెక్కింపబడిన గ్రాంథికమునకు సమానముకాదు.

ఆధునికాంధ్రవచనపితగా చాలమంది వీరేశలింగముగారిని పొగడుచుండినను, అప్పారావుగారికి, అదిసరిపడలేదని పైజాబులవలన స్పష్టము. వారికి వీరేశలింగముకన్న పూర్వాచార పరాయణుడైన చిన్నయసూరియే నచ్చినాడు. వారిది పూర్తిగా ఇతరమార్గముపనికిరాని వ్యావహారిక మారము. వీరేశలింగము పంతులుగారు ప్రతిదానికిని ప్రారంభకులని అనుకొనునట్లు ఒకపేరు సంపాదించి సమకాలికులలో చాల పలుకుబడి సంపాదించినారు గాని, అప్పారావుగారు గాని, జీ. వి. రామమూర్తిగారుగాని ఇంత శ్రమపడి తమ మతమునకు త్రిప్పుకొనవలసినంతటి మహావ్యక్తి కారు. ఎవరైనను తమ వాదమునకు గాని పలుకుబడికిగాని సులువుగా లొంగి స్వాధీనులగుట నిశ్చయము కాని వేంకటరాయశాస్త్రిగారే వీరికి కొఱుకుపడరాని ప్రతిద్వంది; ఎంత పాటుపడియైనను ఒప్పించి తెచ్చుకొనవలసినంతటివారు. అట్టివారి ఒప్పుదల తమ నూతన ప్రతిపాదనకు కొండంతప్రతిష్ఠ తెచ్చునని వారు భావించిరి. అతికఠిన పూర్వసంప్రదాయానుసారియైనవాడు, ఆధునిక మార్గమును ఒప్పుకొనుటయే అది శాస్త్రీయమను ప్రతిషను పొందుటయగును. నూతనమార్గమునకు బలమును పవిత్రతను తెచ్చిపెట్టును గదా. అప్పారావుగారి జాబులలో ఈ విషయములు స్పషములు.

1915 లో అప్పారావుగారు గతించిరి. రామమూర్తిగారు వ్యావహారిక వాదప్రచారమునకు నాయకులైరి. అప్పారావుగారు స్నేహపూర్వకముగా ప్రార్థనగా వేంకటరాయశాస్త్రిగారిని తమ కనుకూలముగా త్రిప్పుకొన ప్రయత్నింపగా రామమూర్తిగారు ఎదురునిలిచి, శాస్త్రిగారి గ్రంథములలో, రచనలలో, తప్పులు కనిపట్టి, ఒక క్రొత్త సిద్ధాంతమును - శాస్త్రిగారివంటి అత్యుత్తమోపాధ్యాయునికే గ్రాంథికాంధ్రరచన సాధ్యముకానప్పుడు, అది ఇతరులకు సాధ్యమా, కాబట్టి వ్యావహారికభాషయే శరణ్యము. గ్రాంధికము త్యాజ్యము - అని యొక నూతన సిద్ధాంతమును ప్రతిపాదించి తమ ప్రచారమును సాగింపనారంభించిరి. వేంకటరాయశాస్త్రిగారు, తమకును రామమూర్తి గారికిని ముఖాముఖిగానో పత్రికలలోనో వాదప్రతివాదములు జరుగకపోయినను, భాషయును వ్యాకరణమును ప్రమాణములుగాని తాము కామనియు, తమలో తప్పులు, పొరపాట్లుఉన్నయెడల అవి దిద్దుకొనవలసినవే గాని ప్రమాణములు కావనియు

తమ యభిప్రాయమును తెలిపినారు. ఉన్న పండితులలో మిన్నయైనవాని భాషలోనే పొరపాట్లున్నవని, అంతమాత్రమునకే, చక్కని ప్రామాణికభాష యొక్క సకలనిర్మాణమును, వ్యావహారిక భాషకొఱకు ధ్వంసము చేయుట యుక్తము కాదనిరి. కాని, గిడుగువారి యాక్షేపణలు నూతనాంశ ప్రకాశకములైన భాషాపరిశోధనలుగా తయారైనవి. ఎన్నో క్రొత్త విషయములు తెలియవచ్చినవి. కాని అందరికినిపనికివచ్చు ప్రామాణికభాషాస్వరూపమును మార్చుటకు అవి పనికిరాలేదు.

1919 లో మొట్టమొదటిపర్యాయము గిడుగురామమూర్తిగారికి వేంకటరాయశాస్త్రిగారిని ఆక్షేపించుటకు అవకాశము దొరకినది. ఆంధ్ర సాహిత్యపరిషత్తు యొక్క ఆ సంవత్సర సమావేశము, వేంకటరాయశాస్త్రిగారి అధ్యక్షతలో, నెల్లూరిలో జరిగినది. నాటి అధ్యక్షోపన్యాసము వీరికి విమర్శకు విషయముగా దొరకినది. ఆ యుపన్యాసములో, రచయితల పేళ్లు చెప్పలేదు గాని, కొన్ని పాఠశాలల యొక్కయు, కళాశాలల యొక్కయు పాఠ్యగ్రంథముల భాషను శైలిని విమర్శించిరి. ఇంకను వాఙ్మయమునుండి ఎన్నో విషయములను చెప్పిరి. శ్రీ గిడుగువారికి ఆపాఠ్యపుస్తకముల రచయిత వీరేశలింగముగారని తెలిసినది. వెంటనే పరిశోధన ప్రారంభించిరి. 1921 లో, ఈయాక్షేపణలకు జవాబిచ్చిరి. తర్వాత 1897 లో శాస్త్రిగారు, కొక్కొండ వేంకటరత్నము పంతులవారిమీద చేసిన విమర్శను కూడ సమర్థించుటకు ప్రయత్నించి కొంతవ్రాసిరి. శృంగారనైషధ వ్యాఖ్యనుకూడ కొంతతాకిరి. 1921 నాటికి గిడుగువారికి పెక్కు అనుకూలములు కలిగినవి. పెక్కు తాళపత్రప్రతులును దొరకినవి. కొక్కొండవారి రచనలమీది యాక్షేపణలను సమర్థించుకొనుటకు గిడుగువంటి పండితులకే మూడు దశాబ్దములు పట్టినవి. అంతవరకు శాస్త్రిగారిని కాదన్నవారులేరు. పరిశోధనవేఱు, వ్యక్తిగతాక్షేపణ వేఱు. గిడుగువారు శాస్త్రిగారిని తమకు బదులిమ్మని కోరిరట. శాస్త్రిగారికి వార్ధక్యము (67 సం) కలిగినందువలనను, జబ్బుపడి జీవితములో ఆర్థిక క్లేశములలో నున్నందువలనను, పెద్ద జవాబు వ్రాయుటకు ప్రయత్నింపలేదు. తమ వ్యక్తిగతాభిప్రాయమును, పరిశోధనల వలన నూతనాంశములు తెలిసి, తాము పూర్వము చేసిన యాక్షేపణలు తప్పైన తమకు సంతోషమే అనియు, కాని తమకు పూర్తి సమాధానము రాలేదనియు, ఇంకను ఎంతో పరిశోధింపవలసియున్నదనియు తెలిపిరి. ఎవరుగాని కొక్కొండవారినిగాని, వీరేశలింగముగారిని గాని పూర్తిగా సమర్థించుట సాధ్యముగాదు. ఏవో కొన్ని పదముల సాధుత్వమును సమర్థించుటవలన సమకూడు ప్రయోజనమేమియులేదు. గిడుగువారు నూతన తాళపత్రములు మున్నగువానిచేత పరిశోధించి కొన్ని పదముల సాధుత్వమును నిరూపింపగల్గిరేగాని, వాఙ్మయమంతయు సమగ్ర

ముగా దీనివలన నిరూపితముగాదు. అందువలన గ్రాంథికాంధ్రమును త్యజింపవలెనను వాదము సరికాదు. శ్రీకృష్ణదేవరాయల యాముక్తమాల్యదకు వ్యాఖ్యవ్రాయుచు శాస్త్రిగారు, గిడుగువారు కొన్ని పదముల మూలార్థమునే గ్రహింపక పొరపడినారని నిరూపించియున్నారు.

ఈ కాలములో, సామాన్య జనులు, అదొక విప్లవముగా వ్యావహారిములో వ్రాయుచున్నను, విద్యావేత్తలు వేంకటరాయశాస్త్రిగారి మార్గమునే యనుసరించుచు, ఉన్నత పాఠశాలలలోను, కళాశాలలలోను ప్రామాణికభాషనే యవలంబించుచు, భాషాపారిశుద్ధ్యమును కాపాడుచున్నారు. ఆంధ్ర వాఙ్మయము విషయములో తాతగా రనుసరించిన పద్ధతి, ఆ గొప్ప ఇంగ్లీషు పార్లమెంటు సభ్యుడు, ఎడ్మండ్‌బర్క్ అనునతడు అమెరికా ఫ్రాన్సుదేశాల స్వాతంత్ర్య విప్లవములను గుఱించి అనుసరించిన విధానముతో పోల్చవచ్చునని నాకు తోచుచున్నది. అమెరికావారి స్వాతంత్ర్యోదమును బర్క్ పూర్తిగా సమర్థించినాడు, ప్రోత్సాహమిచ్చినాడు. రెండవ విప్లవమును (ఫ్రెంచి) పూర్తిగా నిరసించినాడు. ఇప్పుడు, ఇంత కాలమైన తర్వాత, మనకు వాస్తవము గోచరించుచున్నది. నేటి ఆంధ్ర వచన రచయితలలో చరిత్రకారులు, వాఙ్మయ సమీక్షకులు సార్వజనీనమైన గ్రాంథికమునే, ఉదాత్తభావ వ్యక్తీకరణమునకు ఉపయుక్తమని వాడుచుండగా, పత్రికలవారును రాజకీయులును, ఇప్పటి కవులును తమ తమ ప్రాంతీయభాషలను వాడుచున్నారు, ఇది ఇతరాంధ్ర ప్రాంతములవారికి, చాలమందికి, అంత సులువుగా తెలియక, కొంత శ్రమను కలిగించుచున్నది.

## 8. నాటక ప్రయోగములు, ఆంధ్రభాషాభిమాని సమాజము

వేంకటరాయశాస్త్రిగారి జీవితములో మఱియొక ముఖ్యాంశము వినోద కార్యముగా నాటకరచన, తత్ప్రయోగాదిసేవ. వారు నాటక రచయితయేగాక చక్కని దర్శకుడు. ఇతర నాటకరచయితలవలె గాక వారెప్పుడును రంగ ప్రయోగమును మనసులోనుంచుకొనియుండి తమ రచనలను తదనుగుణముగా పొందుపరచెడివారు. గత శతాబ్దపు 1880 - 90 ప్రాంతముల నుండియే కళాశాలలో తమ విద్యార్థులచేత అయా సంవత్సర పాఠ్య

గ్రంథములైన సంస్కృత నాటకముల నాడించెడివారు. ఈ విధముగా వారు అభిజ్ఞానశాకుంతలము, నాగానందము, ప్రియదర్శికానాటిక మున్నగు వానిని ఆయా సంవత్సరములలో ఆడించినారు. భవభూతి యొక్క ఉత్తర రామచరిత్ర నాటకమును, పాశ్చాత్యులు రంగమునకు పనికిరాదని నిర్ణయించిన దానిని, చాల చక్కగా ఆడించినారు. శాస్త్రిగారి శిక్షణ ఎంత చక్కనిదనగా, నటులు ఒక పొరపాటు కూడ రానీయక ఆడగా, నాటి మదరాసు ప్రేక్షకులు దానిని 'అతి శాకుంతలము' అనగా రసోత్పత్తియందు ప్రేక్షకుల హృదయములను ద్రవించి, శాకుంతలమునే మించినదని, మెచ్చుకొనునంతగా నుండినది. కళాశాలలోనేగాక, బయట, సంస్కృతాభిమానులు సంఘములుగా కూడ చేరి, సంస్కృతనాటకముల నాడుచుండిరి. మద్రాసులో సుప్రసిద్ధ న్యాయవాదులుగా నుండిన శ్రీ టి. ఎస్. నారాయణ శాస్త్రిగా రనువారు శ్రీరామపాత్రదారిగా వేంకటరాయశాస్త్రిగారి దర్శకత్వమున ఉత్తరరామ చరిత్రను ప్రదర్శించెడివారు.

ప్రతాపరుద్రీయ నాటకము వెలువడిన వెంటనే కొందఱు నెల్లూరులోని విద్యావేత్తలు దానిని ప్రదర్శింపదలచి ప్రయత్నించిరి. తగిన దర్శకులు లేనందువలన వారి ప్రయత్నములు నెఱవేరలేదు. గొప్ప పండితులు పూండ్ల రామకృష్ణయ్య, గునుపాటి ఏనాదిరెడ్డి వంటివారు చాలమంది ఆంధ్రభాషాభిమానిసమాజ మను పేరట ఒక సభను, శాస్త్రిగారి నాటకములను మాత్రమే, ప్రదర్శించుటకు, స్థాపించిరి. ఏలయనగా, ఇతరుల నాటకములు, పాత్రోచితభాషలేనందువలన, రంగమున ప్రయోగ యోగ్యములుకావని నాడు వారి యభిప్రాయము. ఈ సమాజము పట్టభద్రులైన విద్యాధికుల నెందరినో ఆకర్షించినది. శాస్త్రిగారియొద్ద క్రైస్తవకళాశాలలో సంస్కృతము చదువుకొనినవారు కొందఱు నెల్లూరులో చేరినవారు కూడ ఇందు కలిసిరి. శాస్త్రిగారిని అధ్యక్షులుగా వీరు నియమించుకొని, వారి శిక్షణ క్రింద, వారి ప్రతాపరుద్రీయమును, వారు ఆంధ్రీకరించిన నాగానంద శాకుంతలములను ప్రదర్శింపనారంభించిరి.

దేశమందు నాటకప్రదర్శనోద్ధరణము యక్షగానములకు స్వస్తి చెప్పినది. పార్సీ నాటకాల సంఘములు తమ రంగు రంగుల పరదాలు, వేషములు, దృశ్యములు - వీనితోడి ప్రదర్శనములచేత నాటకములను జనాకర్షకములుగా తయారుచేసిరి. ఆంధ్రదేశములో ప్రతిజిల్లాకొక నాటక సంఘము ఏర్పడినది. ఎందరో జమీందార్లు వీనిని పోషింపసాగిరి. రాయలసీమ ప్రాంతము (బళ్లారి, అనంతపూరు, కడప, కర్నూలు) లో శ్రీ ధర్మవరము రామకృష్ణమాచార్యులవారు పౌరాణిక నాటకములను అప్పటికే జనాకర్షకముగా ఆడుచుండిరి. మదరాసు నగరము, ఈ రాజ్యమునకే

రాజధానిగా నుండినది, నాటకములకు కేంద్రస్థానమైనది. మదరాసులోని సుగుణ విలాస సభ సాంస్కృతిక కార్యక్రమములకు చాల ప్రసిద్ధి గాంచి యుండినది. దీనిలో ప్రసిద్ధపురుషులుగా నుండినవారు రావు బహదూరు సంబంధ మొదలియారుగారు. తప్పక చెప్పవలసినవారు, మఱియొకరు, శ్రీ శాస్త్రిగారికి దగ్గరి జ్ఞాతి, తమ్ముని వరుసవారు, నల్లయ్య యనబడు వేదము వేంకటాచలయ్యగారు, వీరు ఈ సభలో చాల ప్రముఖులు, నటులు, నాటక రచయితలు, దర్శకులు, అన్నిటిని మించి ప్రసాధనకళలో (మేకప్) నిపుణులు. ఆ సభయొక్క అభివృద్ధి వారిచేత నుండినది. ఇప్పుడు కూడ ఆ సభా మందిరము వీరి త్రైవర్ణ చిత్రముచే, (మనిషి పొడవు గలది) అలంకరింపబడియున్నది. చూడవచ్చును. సినిమారంగములోని చాలమంది మేకప్ నిపుణులు, తాము, నల్లయ్య శిష్యులమని చెప్పుకొనెడువారు.

ప్రతాపరుద్రీయము త్వరలోనే, మదరాసులోను నెల్లూరులోను మాత్రమే గాదు, ఆంధ్రదేశమందంతటను, జనాకర్షకమైనది. ఆశ్చర్యమేమనగా విద్యాధికులు, న్యాయవాదులు, పట్టభద్రులు, పండితులు, విద్యావంతులైన రచయితలు, నాటక సంఘములు స్థాపించిరి. అదియొక పరిణామకాలము, ప్రాచీనాచార పరాయణుడైన బ్రాహ్మణుడు నాటకములలో వేషము వేసినచో బహిష్కరించెడు కాలము. కాని వేంకటరాయశాస్త్రిగారి శిష్యుడై, వారి శిక్షణ క్రింద పాల్గొన్నచో ఎవరును తప్పు చెప్పెడివారుకారు. శాస్త్రిగారు పాత్రధారణ మెప్పుడును చేయలేదుగాని ఆంధ్రదేశమునందంతయు ప్రతాపరుద్రీయములో వారే యుగంధర పాత్రధారి యని యొక ప్రసిద్ధి యేర్పడినది.

సమాజమువారు 1904 లో, ఉషాపరిణయమును, 1909 లో ప్రియదర్శికను ఆడిరి. స్త్రీలు పాత్రధారణ మొనర్చెడువారు కారు. 1930 తర్వాతనే స్త్రీలు నాటకరంగ ప్రవేశమొనర్చిరి. (తర్వాత సినిమా రంగము), సమాజములో పెద్దల ఆజ్ఞాపాలన అతి కఠినముగా జరిగెడిది. నటులందరు చక్కగా నేర్చుకొనియుండిననేగాని వేంకటరాయశాస్త్రిగారు నాటకములను ఆడనిచ్చెడువారుకారు. సమాజసభ్యు లొకరికి వారు వ్రాసిన జాబులో నిట్లు వ్రాసియుండిరి. "నటులందఱు అన్నివిధముల తమ తమ భాగములలో చక్కగా శిక్షితులైయుండిననేగాని నాటకము ప్రదర్శింపబడదు. నీవు నీ ఆరోగ్యమును కాపాడుకొనవలయును. ఆవశ్యకమైన కాడ్‌లివరాయిల్ పుచ్చుకొనిన నీ కంఠస్వరము బాగుండును.'

వేంకటరాయశాస్త్రిగారు తమ మూడవ స్వతంత్ర నాటకమును (రెండవ చారిత్రక నాటకమును) బొబ్బిలియుద్ధనాటకమును 1916 లో ప్రకటించిరి. విషయానుగుణముగా కాబోలు భాషలో మార్పు కనబడినది. అది మనకు

సూటిగా (కావ్యము వలె డొంకతిరుగుడులేక) సులువుగా (విషయబాహుళ్య ములేక) మనకాలమునకు చేర్పుగా, ఆంధ్రదేశమునకు, సంబంధించినదిగా, ప్రాంతీయవిషయజాతీయతతో (సొంతఊరి సంగతివలె) కుదిరినది. పద్య ములుకూడ ఉషా ప్రతాపరుద్రీయ నాటక పద్యములవలె గాక, మఱియొక విధముగా పడినవి. ప్రబంధభావమొ, కావ్యశైలియో లేక, ఒక జమీందారి వాతావరణము కుదిరినది. పాత్రలుకూడ చారిత్రకములై, మన దైనందిన జీవితమునకు కొంత దూరమైనను, మనకు చాల చేరై, మన సానుభూతిని ఎంతో చూరగొనుచున్నవి. కాని, పుస్తకముగా ముద్రితమైనప్పుడు విమర్శకులకును, నాటకాభిరుచిగల వారికిని, సదభిప్రాయము కలుగలేదు. కావలి వాస్తవ్యులు, సుప్రసిద్ధ నవలారచయిత కీ. శే. శ్రీ డి. వెంకట రామరెడ్డిగారు, రచయితయే గాక విమర్శకులు, తాతగారికి ప్రియమిత్రులు, తమకువిషాదమును, ఆశాభంగమును కలిగినవని వ్రాసినారు. – 'ఆ మహో దాత్తమును భావగర్భితమైనభాష జనసామాన్యప్రీతికొఱకు, ఉద్దేశపూర్వ కముగా బలివేసినట్లైనది.' కాని, ఆ తర్వాత, నాటక ప్రదర్శనమును ఒక మారు చూచి, మరల నొకమారు నాటకమును తీరికగా చదివి, వారు తమ యభిప్రాయమును మార్చుకొన్నారు. తాతగారి కిట్లు వ్రాసినారు.

'బొబ్బిలియుద్ధ నాటకము ప్రకటింపబడినది మొదలు ఆ నాటకము యొక్క ప్రదర్శనమును చూచుటకు నా కవకాశము దొరకలేదు. నిన్నటి దినము ఏదో పనిమీాద నెల్లూరికి పోయియుంటిని. పనులు ముగించుకొని (రాత్రి) పరుంటిని. రాత్రి పన్నెండు గంటలకు, టౌనుహాలువైపునుండి సంగీతము వినబడినది. మొదట అదేదో సినిమా ప్రదర్శనమని యనుకొం టిని, కొంతసేపు నిదానించితిని. తర్వాత ఊరక నాకుతూహలము తీర్చు కొనుటకు టౌనుహాలువైపు పోయితిని. వాకిటప్రకటన చూచితిని. చదువగా అది మన సమాజమువారి బొబ్బిలి యుద్ధనాటక ప్రదర్శనమని తెలిసినది. టికెట్టు కూడ కొనక లోపల ప్రవేశించితిని. చతుర్థాంకము అప్పుడే ముగియనుండెను. శ్రీ శివరామయ్యగారు కూడ నుండిరి. నాటకము ముగియువఱకు మేము అచటనే యుంటిమి.

'నాటకము అద్భుతముగా నుండినది. నాటకము యొక్క ప్రాశస్త్యము చాల చక్కగా నాకు అప్పుడుగాని తెలియలేదు. చాల సంతోషించితిని. ఆ ముందరి అంకములుకూడ చాల చక్కగా నటింపబడినవని నాకు శివరామ య్యగారు చెప్పినారు. అప్పుడు నేను రాలేకపోయినందులకు చింతించు చున్నాను. పాత్ర చిత్రణము, సంభాషణలలో శక్తి, మహాకవి రచనలన్న విషయము చాల చక్కగా తెలిసినది.

"నటులుకూడ తమ సామర్ధ్యమునంతయు ప్రదర్శించినందులకు వారిని అభినందింపవలెను. బుస్సి పాత్రము ఆ దేశీయులవలె ఉచ్చరించియుండిన యెడల ఇంకను బాగుండెడిది. ఆ పాత్ర ఎంతో జీవకళతో నుండినది.

"విషాదము, శౌర్యము, పరాక్రమము, దృఢసంకల్పము, మున్నగు పాత్రప్రదర్శిత భావములు, ప్రేక్షకులలో తుల్యభావములను రేకెత్తించి నవి. ఎక్కువగా వ్రాయుట ఎందులకు, నాటకము అద్భుతముగా విజయ వంతమై యుండినది. బొబ్బిలి, ప్రతాపరుద్రీయముకంటె బీడుగా నున్నదని నేనిదివరలో వ్రాసినది చాల పొరపాటని నేనిప్పుడు చెప్పక తప్పదు.

"తమ *ఆముక్త ఎంతవఱకు వచ్చినది. ఉత్తరరామచరిత్ర ఆడగా చూడగోరుచున్నాను.

తమ విధేయుడు
డి. వెంకటరామ రెడ్డి.

బొబ్బిలియుద్ధ నాటకము అచ్చుపడుచుండగా, శాస్త్రిగారి పోషకులు, వెంకటగిరి మహారాజాగారు, శ్రీరాజగోపాలకృష్ణ యాచేంద్రులు, ఉదార వాఙ్మయ పోషకులు, పులివేటలో ప్రమాద మరణము పొందినారు. అది శాస్త్రిగారికి పెద్ద దెబ్బ. అందువలన విద్యాధికుడైన ఆ మహారాజపోషకుని అభిప్రాయము కూడ లేకపోయినది. ఎందులకనగా, ఆ గ్రంథము ఆ మహా రాజావారి కులమై, దక్షిణ భారతదేశమందు సుప్రసిద్ధమైన, వెలమ జమీందారుల ప్రశస్తికే ఉద్దేశింపబడినది. అందుచేత అది మఱింత విషా దకరమైనది. మఱియొక దుఃఖమేమనగా, మఱియొక మిత్రుడు గురుజాడ అప్పారావుగారు కూడ, ఒక సంవత్సరము ముందే గతించిరి. నాటక మందలి వచనమును గుఱించిగాని, కథయొక్క అల్లికను గుఱించిగాని అభిప్రాయము చెప్పుటకు వారును లేకపోయిరి. వారు విజయనగరము మహారాజావారికి మిత్రులైనందువలన, నాటకములో విజయరామరాజు పాత్రను, జానపదవాఙ్మయములోను, కావ్యనాటకములలోను వర్ణించినట్లుగా, కుట్రగోరుగాను, దుష్టుడుగాను, రంగారావును అత్యుత్తమ పురుషునిగాను వర్ణించుట వారికి ప్రియముగా నుండియుండదు. దేశములో జాతీయభావ ములు ఉద్భవించినందువలన ప్రజాభిప్రాయములు మారినవి. రచయిత లును, ఈరెండు జమీందారుల కుటుంబములను స్నేహితులనుగాను, వారి మధ్య ఏర్పడిన మనస్తాపములను, తమకు అప్రియములైనందువలన మాని,

* ఆముక్త అన్నది ఆముక్తమాల్యదకు సంగ్రహరూపము. శ్రీకృష్ణదేవరాయలు వ్రాసిన తెలుగు కావ్యము, దానికి అప్పుడు తాతగారు వ్యాఖ్య వ్రాయుచుండిరి.

దుర్మార్గమంతయు ఫ్రెంచి గవర్నరుదో లేక ఆతని ప్రతినిధిదో లేక ఆతని సలహాదారును నైజామునొక్క కార్యస్థుడును నైన హైదరుజంగుదిగానో వర్ణింప ప్రయత్నించుచుండిరి. తత్పూర్వమొక జాబులో శ్రీ అప్పారావుగారిట్లు వ్రాసియుండిరి. (17 జూలై, 1914) "మీరు ఉద్దేశించిన బొబ్బిలి యుద్ధ నాటకమును గురించి — మీరు దానిని పూర్తిగావింపకపోవుట శోచనీయము. విజయనగరమువారికి వ్యతిరేకముగా మీరేమియు వ్రాయ లేదని భావించెదను. ఆకాలపు చరిత్రమీద నాయొద్ద చాల విషయమున్నది. మీరు ఆ నాటకమును పూర్తిచేయదలంచుపక్షమున నేనా విషయములను పూర్తిగా మీకిచ్చెదను. ఆ విషయములు విజయరామరాజు దేశభక్తుడని వెల్లడి చేయగలవు. ఆతడు ఫ్రెంచివారిని సర్కారులనుండి తరుమగొట్టు నుద్దేశించి బొబ్బిలివారిని సహకరింపుడని కోరెనుగాని అందులకు బొబ్బిలి వారు ఒప్పుకోలేదు."

అప్పారావుగారి విషయసంకలనము ఎందుచేతనో తాతగారి కుపయోగ పడలేదు. కాని ద్వితీయ ముద్రణమున కొన్ని మార్పులు చేసినారు.

19-2-1935 నాటి హిందూ పత్రికలోని సమీక్షలో నిట్లున్నది. 'కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రిగారి ఈ గొప్ప నాటకమును ప్రకటించుట చేత ప్రకాశకులు చాల మంచిపని చేసినారు. కవిగారి జీవితకాలములో ఈ నాటకము, చాలసార్లు రంగముమీద ప్రదర్శింపబడినది. ఆయా ప్రదర్శన ముల కాలములలో పాత్ర సంభాషణములను మార్పవలెనని కవిగారికి తోచి చేసియుండిరి. ఆ మార్పులు ఈ ముద్రణములో చేయబడినవి. ఈ కథమీద ఇతరుల నాటకములున్నను, సంభాషణల శక్తిలోను, భాషాపాటవములోను, ఈ నాటకము అద్వితీయము. అందులోను ముఖ్యముగా రంగారావు యొక్క దండును, మొగలాయీవారి సైన్యమును చేసిన యుద్ధవర్ణన చాల అద్భుత ముగా నున్నది. ప్రపంచములోని నాటక వాఙ్మయములో, అట్టి గొప్ప వర్ణనలకు ఇది సాటికాగలదు.'

ఆంధ్ర విశ్వవిద్యాలయాచార్యులై యుండిన పింగళి లక్ష్మీకాంతముగారు శాస్త్రిగారి జయంతులలో నొకదానిలో మాటలాడుచు ఈ నాటకమును చాల ప్రశంసించిరి. ఈ క్రింది వాక్యములు 16-1-1936 హిందూపత్రికలోని నివేదికలోనుండి గృహీతములు. "ఈ మహనీయులైన కళాప్రపూర్ణులు గొప్ప దేశీయకవి. ఆంధ్రవాఙ్మయములో శ్రీనాథుడు పల్నాటి వీరచరిత్ర కాటమ రాజుయొక్క కథ మొదలైన దేశీయ ఇతివృత్తలమీద రచింపగా కీ. శే. కళాప్రపూర్ణులు రెండు మహోన్నత రచనలను, ప్రతాపరుద్రీయ బొబ్బిలి యుద్ధములను, వాస్తవిక చారిత్రక వాతావరణముతో, సమకాలిక జీవితమును చిత్రించినారు. ఈ సొంపు తర్వాతి రచయితలలో రాలేదు. ఈ కవియొక్క

ప్రతిభ నాటక రచనలోను విమర్శలోను మహోన్నతము. శ్రీ శాస్త్రిగారు మహాపండితులనియు, ఆంధ్రదేశము యొక్క సాంస్కృతిక పునరుజ్జీవనము నకు తోడ్పడినవారనియు శ్రీ లక్ష్మీకాంతముగారు వచించిరి.

1925 వఱకు ఆంధ్రభాషాభిమానిసమాజము వర్ధిల్లినది. సమాజము యొక్క ప్రదర్శనములు ధనాదాయకములుకాక, కేవల వాఙ్మయ వినోదకార్య ములైనందువలన, రజతోత్సవానంతరము సమాజమును సభ్యులు మూసి వేసిరి. సాక్షాత్తుగా సమాజమును మూయకపోయినను, సభ్యులు చాలమంది వృద్ధులైనందువలనను, ప్రసిద్ధ సభ్యులు, అధ్యక్షులకుముందే గతించినందు చేతను, సమాజమే పనిచేయుట మానివేసినది. రజతోత్సవమునాటి రాత్రి కావించిన రత్నావళీనాటికా ప్రదర్శనమే సమాజముయొక్క తుదిప్రదర్శనము. శాస్త్రిగారు బొబ్బిలియుద్ధనాటక రచనానంతరము శ్రీహర్షుని రత్నావళిని కాళిదాసుయొక్క మాళవికా విక్రమోర్వశీయములను అనువదించిరి. వీనిలో మాళవిక ప్రదర్శించుటకు సందర్భము కుదురలేదు. 1922 లో, విక్రమోర్వ శీయము చాల చక్కగా పలుమార్లు ప్రదర్శింపబడినది. ఈమూడు నాటక ములును శ్రీకావలి దొడ్ల వేంకటరామరెడ్డిగారి ప్రోత్సాహముచేత అనువ దింపబడినవి. వీరి సంతుష్టికొఱకే ఉత్తరరామచరిత్ర ఆడబడినది. ప్రదర్శ నమును విజయవంతముగా నుండినది.

1925 కు తర్వాత ఈ నాటకములు, వాని ప్రజాదరము తగ్గకపోయినను ఎక్కువగా ప్రదర్శింపబడలేదు. పూర్తిగా నాటకములను ఆడుటకు బదులు వానిలోనుండి కొన్ని భాగములను ఆడుచుండిరి. శాస్త్రిగారు వ్రాసిన పది నాటకములలో వారి ప్రతాపరుద్రీయ బొబ్బిలియుద్ధ శాకుంతలములమీద ప్రజాదరము తగ్గలేదు. మిగిలినవి విశ్వవిద్యాలయములలో పాఠ్యగ్రంథ ములుగా పఠింపబడుచున్నవి.

## 9. నిరుపమానములైన వ్యాఖ్యానములు

1915 లో సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయము పిఠాపురమునకు మార్చబడిన తర్వాత, తాతగారు నిఘంటు సంపాదకత్వమునకు రాజీనామా ఇచ్చి, తమ అచ్చాపీసుపనిలోనికి మరలినారు. కాని వ్యాపారము నష్టమునకు దారితీసినది. ఐదాఱువేల రూపాయల నష్టమేర్పడినది.. ఆలోచించి,

అచ్చాపీసును విక్రయించి, అప్పులు తీర్చి, వేయి ఆదాయమేర్పడువఱకు, విక్రయధనముతో అప్పులు తీర్పగా మిగిలినదానితో, శాంతముగా జీవితము గడుపనిశ్చయించుకొనిరి. మహాసంగ్రామానంతరపు పరిణామములవలన, ధరలు పెరిగి, పరిస్థితులు విషమించినవి. శాస్త్రిగారు తమ రచనలను ఇతరత్ర ముద్రించి ఆ విక్రయధనముతో తృప్తినందదలంచిరి. 1919 లో అచ్చాపీసు విక్రయింపబడి అప్పులన్నియు నివర్తియైనవి. ఏవో, కొద్ది పుస్తక విక్రయము, ఇంటిలో కొంతభాగము అద్దెకిచ్చి ఆ అద్దె, ఇత్యాదులు, నాటి వారి వరుంబడి. నిఘంటుసంపాదకులుగా నుండిన కాలములో, పర్యవేక్షకులు లేక, పాడైపోయిన అచ్చాపీసును చూచుకొనవలసిన ఆవశ్యకత లేనందువలన వారికి ఎంతో కాలము కలిసివచ్చినట్లైనది.

1913 లో శృంగారనైషధ వ్యాఖ్య ప్రకటించినను, శ్రీకృష్ణదేవరాయలు వ్రాసిన కావ్యమైన ఆముక్తమాల్యదకు కూడ అటువంటి ముద్రణమును సంకల్పించియుండిరి. వాస్తవముగా ఆముక్తమాల్యదకే వారు మొదట వ్యాఖ్య వ్రాయసంకల్పించిరి. కాని ఆ పని, ప్రారంభములో తోచినంత సులువుగా గాక చాల శ్రమతో కూడియుండెను. అందువలన వారు మొదట శృంగార నైషధమునకే వ్యాఖ్య వ్రాసి ప్రకటించిరి. సందర్భములును శృంగార నైషధమునకే అనుకూలించినవి. నెల్లూరివారు, ఉదార వాఙ్మయ పోషకులు, నెల్లూరికే గొప్ప పౌరసౌధమును ప్రసాదించినవారు, శ్రీ రేబాల లక్ష్మీనరసా రెడ్డిగారు, శృంగార నైషధమునకు ఎంత మొత్తమైనను లక్ష్యము చేయక ధారాళముగా ధనసహాయము చేసిరి. ఒకమారు, వారు, ఈ వ్యాఖ్యపై తాతగారి ఉపన్యాసమును వినిరి. ఆ మరునాడే తాతగారికి తమ సందర్శనము కలిగించి, తాతగారి చేతిలో ఆ పూర్తి మొత్తమును పెట్టిరి. కొన్ని నెలలలో ఆ మహాగ్రంథము వెలుగులోనికి వచ్చినది. 1913 లో శ్రీ రెడ్డిగారికి దానిని అంకితము చేసిన దినము నెల్లూరి చరిత్రలోను, తాతగారి జీవిత మందును గొప్ప పర్వదినము.

ఈ సందర్భమున తాతగారికి డా॥ సి. ఆర్. రెడ్డిగా రిట్లు వ్రాసిరి. 'ఇప్పటివఱకు తెలుగులో వెలువడిన వ్యాఖ్యానములన్నింటిలో మీ వ్యాఖ్యయే ఉత్తమోత్తమమని భావించుచున్నాను, ముమ్ముందు కూడ అట్టి వ్యాఖ్యలలో ఒక విశిష్టమైనదిగానుండునేమో .... ఇప్పుడు ఆంధ్రప్రపంచము, ఒక ఆధునిక పండితుడు ప్రాచీన పండితులను వారి విద్యలోనే పరిపూర్ణముగా మించినాడని గర్వపడుటకు అవకాశము కలిగినది.'

శ్రీ గురుజాడ అప్పారావుగా రిట్లు వ్రాసిరి. — "మీ పని పూర్తియై నందులకు నా అభివందనములు. ఆంధ్రభాషావిద్యార్థి కది అత్యంతోప యోగకరము. నైషధము మీ వ్యాఖ్యలేక సామాన్య పండితుల కర్థము

గాదు. ఇంత చక్కగా ఇతరులు చేయలేని దానిని మీరు చేసినారు. మీరు ఎవరిపక్ష మవలంబించిరో ఆ పెద్దలు (మీకు వారికన్న మాతోనే ఎక్కువ కుదిరిక ఉన్నప్పటికిని) నేను పంపిన నిరాకరణ పత్రము (minute of dissent) ను ముద్రింపకూడదని తీర్మానించినారు. అందులో నేను, ఈ కాలపు వచన రచయితలను గురించి వ్రాయుచు, ఆ నిరక్షరాస్యుల రచనల కన్న మీ రచన ఎంత విశిష్టమైనదో తెలిపితిని. మీ స్నేహితులు (ఫలాని వారివంటి) అధమ రచయితల స్తోత్రములు విసుగువేసటలేక చేయుచున్నారు. ఇప్పుడిప్పుడే మీ కృషికి తగిన మర్యాద, కొద్దిగానైనను కలుగుచున్నది. ఈ విద్యావిహీనులు, అవిమర్శముగా, గ్రుడ్డివారివలె, అనుకరించుచున్న వచనశైలి, ఎంత పనికిరానిదో, నేను మొట్టమొదటి పర్యాయము ధైర్యముగా చూపితిని. మీ స్నేహితులు మీకు మామూలు మర్యాద కూడ చేయలేదు. ఒక పాత స్నేహితుడు, అనగా మీ విధేయ సేవకుడు (నేను) మీ ప్రతిపక్షమునుండి, మీరెంత గొప్ప రచయితలో తెలిపి మీకు తగిన మర్యాద యిచ్చినాడు.

“నేను వ్రాసిన ‘నిరసన పత్రము’ ను చూచినయెడల మిమ్ము గూర్చి నేనేమి వ్రాసినదియు మీకు తెలియును. *లక్ష్మణరావుగారు ఒకప్పుడు చెప్పినారు, నేను మిమ్ము స్తోత్రము చేయుచున్నానని. స్తోత్రము చేయువారు వారే, ఏదో స్వలాభముల నుద్దేశించి. నేను నా యభిప్రాయములను ఇండ్ల మేడలెక్కి ఘోషించునంతటివాడను. అవి ఎప్పుడును నా దృఢ విశ్వాసములు.

“మీ రెండులకు తెలుగునకొక మంచి సేవ చేయకూడదు, మహాభారత కథను, వ్యాఖ్యలలోను కథలలోను కనబడుశైలివలె, ప్రాచీన అధునాతన శైలీ మిశ్రణముగా వ్రాయుడని నేను ప్రార్థింపవచ్చునా? మీరు మీ విజ్ఞప్తిలో ఈ పుస్తకము పాఠశాలల విద్యార్థులకు, లేదా, పెద్ద చదువురాని వారికి, లేదా మీ చిత్తమువచ్చినవారి కని వ్రాయుడు. నేను దానిని ముద్రించెదను.

మీ హార్దిక

జి. వి. అప్పారావు.

వేంకటగిరి మహారాజాగారు తాతగారికి దర్శనమిచ్చి కొన్ని గంటలసేపు ఆ వాఖ్యానమును గురించి చర్చించినారట. తాతగారు 11 – 3 – 1914 తారీఖుగల యొక జాబులో తమ తమ్ములు వేంకటాచలముగారికి, నెల్లూరికి (అంగ్లములో) ఇట్లు వ్రాసిరి. ‘ప్రియమైన తమ్మునికి, మొన్న, గడచి

---

* ‘శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు’ సుప్రసిద్ధాంధ్ర చరిత్రకారులు.

పోయిన సోమవారము. ఎన్నాళ్లనుండియో ఎదురు చూచుచుండినట్టిది. శ్రీ వేంకటగిరిరాజాగారి దర్శనము లభించినది. నా శృంగారనైషధ వ్యాఖ్య మీద వారు తమ సంతోషమును, ఒప్పుదలను వెలిపుచ్చిరి. వారి రసగ్రహణము ను పరిశోధనయు, వ్యాఖ్యను, సమగ్రముగా, ప్రతిపదమును వదలక స్పృశించినది. వారి విమర్శ, పాండిత్యముతోను విమర్శనశక్తితోనుకూడి, తర్కయుక్తిసహముగానుండినది. వారు నా పరిశ్రమను మెచ్చుకొన్న విధము, చిన్న చిన్న అంశములమీద కూడ, అత్యుత్తమముగా నుండినది.

తాతగారిని గుఱించి త్రివేణి (1929 మే - జూను) పత్రికలో వ్రాయుచు శ్రీ గుఱ్ఱము వేంకట సుబ్బరామయ్యగారు (M.A) ఆంగ్లములో ఇట్లుగ్గడించినారు.—

'వారి ప్రతిభను గుఱించి మనకు ఎక్కువగా తెలియవచ్చినది ఏదనగా, వారి మానావాతీతమైన గొప్ప (కొండలంత) కృషి. వాస్తవముగా వారు సారస్వత భీములు (హెర్క్యులీసనిమూలము) బహుశః అట్టి దేవాసురులవంటి వారిలో (giants) చివరివారు. ఇది వారు చేసిన కృషియొక్క మేరుసమానమైన స్తోమముచేతను, పూనుకొన్న మహత్కార్యముల స్వభావముచేతను తెలియుచున్నది. దాదాపు ఇరువదియైదు సంస్కృతాంధ్ర కావ్యములను సంస్కరించి విపుల వ్యాఖ్యానములతో ముద్రించుట, అత్యుత్తమ సంస్కృత నాటకములలో ఏడింటిని, వానితోచేర్చి కథాసరిత్సాగరమును అనువదించుట, తెలుగులో మూడు స్వతంత్ర నాటకరాజములను రచించుట, ఇంకను ఇతర రచనలు, వాని బాహుళ్యముచేతనే, కళాప్రపూర్ణులయొక్క, మేరుసమాన శక్తిని మనసునకు కొట్టవచ్చినట్లు తెలుపుచున్నవి. మన ఆశ్చర్యమునకు ఒక విషయము ప్రధానము. ఏదనగా ఈ రచనలు ఒక్కొక్కటియు ప్రత్యేకముగానే ఒక్కొక్క రచయితకును ఒక జీవితకాలము పట్టునట్టినది. అంతెందులకు, ఒక్కొక్క పండితసంఘమునకే ఒక జీవితము పట్టునట్టిది. అట్టి రచయితలకు అజరామరమైన కీర్తిని ఆపాదించునట్టిపనులు. అవిఏవనగా, ఉదాహరణమునకు మేఘసందేశవ్యాఖ్య, ఆముక్తమాల్యదా శృంగారనైషధ వాఖ్యలు, ప్రసన్నరాఘవ నాటకవిమర్శ. స్వతంత్రనాటకములలో ఒక్క ప్రతాపరుద్రీయమే చాలును. వారి ప్రతిభ ఉత్తమకార్యసాధనకే ఏర్పడినది. వారి శక్తికి కొండలవంటి పనులు చేసిననేగాని తృప్తియుండదు. అతికఠినమైన ఆముక్తమాల్యదను వ్యాఖ్యతో ముద్రించుట, పదియంకముల మహానాటకమును, పెద్దకావ్యమువలె వ్రాయుట, మహాయోధునివలె ఒక్కడే ఒక పండితసైన్యమును ఎదుర్కొని నిర్వహించుట, ఇవియే చాలును వారి మహామేధకు తగిన పనులుగా.' ఇతర కార్యములు వారికి పిల్లలఆటలవంటివి. వారే చెప్పియున్నారు - అనువాదములను, ఇంకను ఎన్నో రచనలను, శ్రమతో కూడిన

మహారచనలనడుమ విశ్రామార్థము తాము వ్రాసినట్లు. ఏదో బుడగవంటి అల్పకవిత్వము, ఏదోయొక మానసిక తాత్విక కథానిక, ఒక లఘు ప్రహసనము, ఏదో ప్రలాపమువంటి పత్రికా ప్రసంగము - ఇత్యాదులు వారికి అల్ప విషయములు. వారి కళాసృష్టికిగాని, పునఃపరిశీలనమునకుగాని ఒక మహా పర్వతమువంటి నిర్మాణమే కావలెను. విమర్శించి పిండిచేయవలెనన్న అటువంటి కొండయే కావలెను.'

వారి శృంగారనైషధమునుగురించి, ముఖ్యముగా ఆంధ్రవాఙ్మయమున దాని విశేషమేమో తెలిసికొనగోరు ఆంధ్రేతరుల కొఱకు ఒకమాట చెప్పవలయును. దాని కవి శ్రీనాథుడు. పదునాలుగవ శాతాబ్దపు ద్వితీయార్థమునను, పదునైదవశాతాబ్ద పూర్వార్ధమునను వర్ధిల్లిన మహాకవి. ఆంధ్రదేశమును పాలించిన రెడ్డిరాజుల యొక్కయు, విజయనగర పాలకులైన రాయల యొక్కయు అస్థానములలో ప్రత్యేకసమ్మానము నందినవాడు. అతని తాత, కాకతీయప్రభువైన ప్రతాపరుద్రుని యాస్థానములో మహాకవిగానుండి నేటి నెల్లూరు జిల్లాలో సముద్రతీర ప్రాంతమున ఒక పట్టాణాధీశ్వరుడుగా నుండినవాడు. శ్రీనాథుని కాలమునకు ఆంధ్రవాఙ్మయమున నొక నూతనదశ ప్రారంభమైనది. పదుమూడవ శతాబ్దము చివరివఱకు ఆంధ్రవాఙ్మయమున వట్టి పద్యానువాదముగా నుండినది. సంస్కృతమునుండి * ఆంధ్ర భారతానువాదము శ్రీనాథుని జననమునకు కొంతముందు, ఒకటి రెండు దశాబ్దములకు ముందు పూర్తియైనది. కొందఱు కవులు సంస్కృత నాటకములను కూడ కావ్యములుగానే అనువదించిరి. రాజశేఖరుని విద్ధసాలభంజికను, మంచన కవి, కేయూరబాహుచరిత్ర యని (క్రీ. శ. 1300) కావ్యమొనరించెను. కాళిదాసు శాకుంతలమును పినవీరభద్రుడు శృంగారశాకుంతల కావ్యముగా వ్రాసెను. ఇతరులు పురాణములను తెలుగు కావ్యములుగా వ్రాసిరి. మొట్టమొదటిపర్యాయము శ్రీనాథుడు సంస్కృతమునుండి ఒక కావ్యమును అనువదించెను. అతని శృంగారనైషధము శ్రీహర్షుని (12 వ శతాబ్దపు) నైషధీయ చరిత్రకు చాల చేర్పైన కావ్యానువాదము. దీనికి ఆంధ్రదేశమందు ఎంతో ఆదరము. శ్రీనాథుని సమకాలికులే సుప్రసిద్ధ మల్లినాథసూరి, కాటయవేమ, వామన భట్టబాణాదులు. రెడ్డిరాజుల కాలములో ఆంధ్రదేశము సంస్కృతవిద్యాకేంద్రముగా నుండి, తెలంగాణా ప్రాంత

---

* నన్నయచే 11వ శతాబ్దిలో ప్రారంభింపబడి, అతనిచే మూడు పర్వములు మాత్రమే అనువదింపబడెను. తర్వాత 13వ శతాబ్దిలో తిక్కనసోమయాజి 15 పర్వములను పూర్తి చేసెను. నన్నయ పూర్తిగా వ్రాయలేదో, వ్రాసినది పోయినదోగాని, ఎఱ్ఱన, తర్వాత 14 వ శతాబ్దములో అరణ్యపర్వమును పూరించెను

మందలి వెలమ రాజులయాస్థానముతోను, విజయనగర రాజాస్థానముతోను పోటీలు పడుచుండినది.

శ్రీనాథుడు శాలివాహనసప్తశతిని, ఇంక నితరములను అనువదించి హరవిలాసమను స్వతంత్రప్రాయ కావ్యమును రచించి, నైషధమును ఆంధ్రీకరించెను. తత్పూర్వపు కవులవలె గాక నైషధమును కొన్ని యెడల పద్యమునకు పద్యముగాను, పంక్తికి పంక్తిగాను కూడ ఆంధ్రీకరించెను కొన్ని యెడల రెండు మూడు శ్లోకములను ఒక పద్యముగా వ్రాసెను. ఐదు అర్థములతోడి పద్యములను, నలదమయంతీ స్వయంవర ఘట్టమున, అనువాదము కుదురనందున మానివేసెను. శ్రీ హర్షుని మూలమునందలి శైలిని, అందలి కవన విశేషములను అనువాదములో వచ్చునట్లు చేసెను. ఇది తర్వాతి కృష్ణరాయల యాస్థానిలోని ప్రబంధ కవులకు ఆదర్శమైనది. తాతగారు మూలముతో ఆంధ్రీకరణమును పోల్చి, రెంటి విశేష గుణములను తులనాత్మకముగ నిరూపించిరి. ఎన్నియో వైదిక పౌరాణిక శాస్త్రీయ విషయములను వివరించిరి. వ్యాఖ్య, రాయలు, 8 పుటలసైజులో, సన్న యక్షరములలో వేయి పుటల గ్రంథము.

1913 లో, శృంగారనైషధ ప్రకటనానంతరము, ఆముక్తమాల్యదపై కృషి ప్రారంభించిరి. శ్రీ పిఠాపురము మహారాజావారు, నైషధవ్యాఖ్యను చూచి, ఆముక్తమాల్యదావ్యాఖ్యా ప్రకటనారము, అచ్చునకు తాతగారు కోరకయే, రు 1200/-- పారితోషికము పంపిరి. వ్యాఖ్యానము వ్రాయ మొదలిడగా, అందులకు ఎంతో పరిశోధన చేయవలసి వచ్చినది. కాలమును పరిశ్రమయు పెరుగనారంభించినవి. నడుమవచ్చిన అంతరాయములచేతను, గడచిన యుద్ధము (1914) యొక్క ఫలితముగా ధరలు పెరిగి, అచ్చు వేయుటకు, మొదటి అంచనకన్న, నాలుగింతలు డబ్బును, అంతకు ఎక్కువ కూడ, ఆవశ్యకమాయెను. ఎందుచేతనో మహారాజావారు ఈ మార్పునకు సంసిద్ధులుగానుండలేదు. వారి కార్యదర్శిగారు ఒక జాబులో తాతగారి కిట్లు వ్రాసిరి. "ఆముక్తమాల్యదను గుఱించి రాజాగారు తమకిట్లు వ్రాయుమనిరి. వ్యాఖ్యతో అది, మీరు ప్రచురించిన విజయవిలాసమునంతయో (సైజులో), ఇంకను కూడ తక్కువగనో (డెమ్మీ సైజులో 200 పుటలు) ఉండిన తమ కిష్టమట. ఆవశ్యకమైనయెడల దానిని రెండు సంపుటములుగా కూడ విడదీయుట మంచిదని వారి యుద్దేశము. నైషధము బాల పెంపకముతో చేతికి ఇముడనంత అసాధ్యముగా నున్నదని వారి యభిప్రాయము. తమ యభిప్రాయమును తెలిపిన సంతోషింతురు."

మూలము బాల కఠినముగానుండి, పాఠభేదములు అనేకములై, అర్థము కుదురకయున్నందువలన, బాల పరిశోధన కావలసి వచ్చినది. కొన్ని

సంవత్సరములు పరిశోధించుటయందే గడచినవి. 1914 నుండి అచ్చాఫీసును విక్రయించువఱకు, తాతగారికి, వ్యాఖ్యను ఒక నెమ్మదితో కూర్చుండి వ్రాయుటకు సాధ్యముకాలేదు. ఆ రచన 1920లో గాని పూర్తికాలేదు. పీఠికకూడ - వివాదగ్రస్తకర్తృత్వ విచారము, గ్రంథగుణములు, వ్యాకరణములు, వైష్ణవ మతోత్కర్షమున్నగు విషయములచేత చాలపెద్దదిగా కొన్ని వందల పుటలకు పెరిగినది.

శృంగారనైషధమును గుఱించి చెప్పినట్లుగానే ఆముక్తమాల్యదను గుఱించికూడ కొన్ని పంక్తులు చెప్పవలెను. కావ్యనామమైన ఆముక్తమాల్యదా సమాసమునకు అర్థము 'తాను ధరించినదానిని (భగవంతునికి) సమర్పించిన వనిత (కథ)' యని. దీనికి మఱియొక పేరు, 'విష్ణుచిత్తీయము' అనగా విష్ణుచిత్తునికథ. విజయనగర చక్రవర్తియు కవియునైన శ్రీకృష్ణదేవరాయడు (1509 - 1529) నడుమ పరిపాలించినవాడు, దైవభక్తిగలవాడు. తిరుపతి వేంకటేశ్వరస్వామికి అత్యంత భక్తుడు, వైష్ణవఆళ్వారులలో పెరియాళ్వారు (విష్ణుచిత్తుడు) యొక్కయు, అయన పెంపుడు కొమార్తె ఆండాళ్‌యొక్కయు (గోదాదేవి) చరిత్రములను, వానితో, ఆళవందార్ (యామునాచార్యుడు) యొక్క చరిత్రమును కలిపి వైష్ణవమతతత్వనిరూపకమైన చక్కని భక్తికావ్యమును వ్రాసెను. ఈ కావ్యమును తన యిష్టదైవమైన తిరుపతి వేంకటేశ్వర స్వామికి, తన యుత్కళదక్షిణదేశాది విజయానంతరము అంకితమిచ్చెను. నైషధమువలెనే అది ఏడాశ్వాసముల మహాకావ్యము. కాని మూలముతోపోల్చి చదువుటకు సహాయకారికా నుండదగిన మూలమేదియులేదు : అది తెలుగులో ప్రబంధయుగము. కవులు తమకు తోచిన కథను గ్రహించి, తమ కల్పనాశక్తిచేత సందర్భోచితముగా పెంచి, అష్టాదశ సాంప్రదాయిక కావ్యవర్ణనలను చేయుచు వ్రాయుటయే ప్రబంధ రచన.

వైష్ణవ సాంప్రదాయిక కథా వాఙ్మయమునుండి గ్రహింపబడిన ఈ కావ్యము యొక్క కథా విశేషము లేవనగా — పెరియాళ్వారనబడు విష్ణుచిత్తుడు, శ్రీవిల్లిపుత్తూరులో నొక విష్ణ్వాలయములో తోటమాలి, విద్యాగంధము లేనివాడు, కాని గొప్ప భగవద్భక్తుడు. వింతగా, ఒకమారు భగవంతునియాజ్ఞచేత, మధురకుపోయి, వాదములో వైష్ణవేతరవాదులను జయించి, వైష్ణవమతమును ప్రతిష్ఠించి, పాండ్యరాజును వైష్ణవునిగా మార్చెను. అచటినుండి మరలి ఇంటికిరాగానే తనతోటలో నొక స్త్రీ శిశువునుచూచి, తనకు పెంపుడు కొమార్తెగా గ్రహించెను. గోదాదేవియని పేరుపెట్టుకొనెను. విష్ణుచిత్తుడు దేవునికి చక్కని పూలమాలలు కట్టుటలో చాల నేర్పరి. కొన్నాళ్ళైనతర్వాత, ఆ శిశువు పెరిగి, యువతియై, దేవునికు ద్దేశింపబడిన ఆ పూలదండను, తండ్రికి తెలియనీయక రహస్యముగా తాను పెట్టుకొని, తోటలోని కోనేటినీటిలో ఒక

మారు అందము చూచుకొని, మరల యథాప్రకారము బుట్టలో పెట్టుచుండెను. ఈ విషయమును ఎంతమాత్రము ఎఱుగని, ఎట్టి సందేహముగాని లేని, ఆ వృద్ధుడు విష్ణుచిత్తుడు, ఒక దినము ఆదండలో పొడుగుపాటి వెంట్రుకనుచూచి రహస్యము కనుగొనెను. కొమారితయొక్క ఆ భగవదపచారమునకు కోపగించుకొని, క్రొత్తదండనుకట్టి భగవంతునికి సమర్పించెను. ఆశ్చర్యము, భగవంతుడు దానిని గ్రహింపక త్రోసివేసి, గోదాదేవి ధరించినదానినే, ఆ వెంట్రుక గలదానినే, కోరెను. భగవంతునికి తెలిసిపోయినది, గోదాదేవికి తనమీద ప్రేమ జనించినదని. తనకును గోదమీద ప్రేమయేర్పడినది. తర్వాత తండ్రితో గోదాదేవి శ్రీరంగమునకుపోయి తన భక్తికి భగవదను గ్రహముగా భగవంతునితో ఐక్యమైపోయినది. ఈ పెద్దకథలో అంతర్భాగ ముగా యామునాచార్యులకథ భక్తికి ఉదాహరణముగా చేర్పబడినది.

కృష్ణదేవరాయలకు విరామములేని యుద్ధములుండినవి. ఆయన గొప్ప విజేత. పట్టాభిషేకకాలము మొదలు జీవితము ముగియువఱకు యుద్ధ యత్నములలోనే యుండినాడు. చక్కగా తయారైన సైన్యముతో అతడు ఒరిస్సాతో చేరి దక్షిణ భారతదేశమంతయు, తాను పరిపాలనకు వచ్చిన పదేండ్లలోనే జయించినాడు. అట్లుండియు యుద్ధములకు నడుమ తన ఆస్థానకవులు - అల్లసాని పెద్దన, ముక్కుతిమ్మన, మాదయగారి మల్లన - అనువారి సంగడిలోనుండి ఆశువుగా కవిత్వము చెప్పెడివాడు. ఈ కవులు ఈయనతో కూడ పోయెడివారు. రాయల పద్యములు, ఆయన యొక్క ప్రధాన కవి, పెద్దనగారి పద్యములవలె నుండక, జటిలముగా, నడక సులువుగా సాగక, అసాధారణమైన ప్రాంతీయ పర్యాయపదజాలముతో నిండి, విచిత్ర వ్యాకరణ ప్రయోగములతో, ఒక విచిత్రశైలిలో నుండును. వ్రాయుటకు వ్యవధిచాలకయో, లేక, పెద్దనగారిమీది గౌరవాతిశయము చేతనో, తన (ఆముక్తమాల్యద) పీఠికలో మనుచరిత్రలోని పద్యములను చేర్చుకొన్నాడు. ఆతనికిని పెద్దనకును మైత్రీ మర్యాదలు ఎట్టివనగా రాయల మరణానం తరము అచిరకాలములోనే, లోకములో ఆముక్తమాల్యదా కర్తృత్వము మఱికొన్ని రచనలతోచేర్చి, జనులు పెద్దనకు అంటగట్టిరి. అదిమొదలు తెలుగుకవులును, వ్యాఖ్యాతలును, ఆముక్తమాల్యాదా కర్తృత్వమును, గ్రంథ ములో రాయలేవ్రాసినట్లుగా, స్పష్టముగా కనబడుచున్నను, పెద్దనకు ముడిపెట్టుచుండిరి. ఆముక్తమాల్యదా ముద్రణముల ఉపోద్ఘాతములలో, ఈ క్లిష్టసమస్యయొక్క విమర్శ మానరానిదిగా నేర్పడినది. కొందఱు ఆధునిక గ్రంథసంపాదకులు ఎంత వికారపువ్రాతలు వ్రాసినారనగా, రాయలు రాజు కాబట్టి, అంతచక్కగా వ్రాయలేడు కాబట్టియు, పద్యరచనలోను, వ్యాకరణ ప్రయోగములోను, పెక్కు ప్రమాదములకు లోనైందున, అతడే ఆముక్తమా

ల్యదాకవి - అని వారి వాదము. పెద్దన ఇంతకన్న చక్కగా వ్రాయగలవాడు. శైలియువేఱు. కాబట్టి ఇటువంటి గజిబిజి కవిత్వమల్లి దానిని తనపోషకునికి అంటగట్టియుండడు - అని. ఈ మహాకావ్యము యొక్క గుణములను అన్నిటిని జాగ్రత్తగా పరిశీలించి, తాతగారు, రాయలు కవిత్వములో ఎవరికిని తీసిపోయిన వాడు కాడనియు, ప్రమాదములని చెప్పబడునట్టి ప్రయోగములన్నియు చాల సం॥ వఱకు వ్రాయసంగాంధ్రవనియు, ఇతరత్ర సాధుప్రయోగములనే, జాగ్రత్తగా చదువక, తప్పులని తలంచినారనియు నిర్ధారించిరి. రాయలు వాస్తవముగా మహాకవి, జీవితములో చక్కని అనుభవము కలవాడై నందుచేత, ఆయన వర్ణనలు, జనులను గుఱించిగాని, ప్రకృతిని గుఱించిగాని, ఉత్తమ కవిత్వ లక్షణములతో హృదయరంజకములుగా నున్నవి - అని తాతగారు నిరూపించినారు. రాయలు రెండవతరగతికవి కాబటి ఆతడే గ్రంథకర్తయనుటచేత ఆయనకు ప్రశస్తి కలుగదుగదా. ఈ కర్తృత్వ విషయమును అతినిపుణముగా తాతగారు సమన్వయించినారు. కొన్నిచోట్ల పెద్దనకు సాధ్యముకాని విషయములుండుటచేతను, అదే విధముగా రాయలకు సహజముగా దొరకని విషయములుండుటచేతను, రాయలు, మనుచరిత్రములోని పద్యములను ధారాళముగా తన కావ్యములో చేర్చుకొని యుండుటచేతను, కవితోకలిసి, ఆయన సహాయముతో రాయలు వ్రాసియుండునని తాతగారు తమ అభిప్రాయము నిచ్చిరి. ఆముక్తమాల్యదలో ఎక్కువభాగము రాయలదే, కాని పెద్దన దానిని, కావలసిన చోట్ల, ఒకమారు పరిచూచి యుండును. కర్తృత్వ సమస్యయు, రాయల సారస్వతశక్తియు, పరస్పర సంబంధము గలవిగాన వ్యాఖ్యరచనకు, తులనాత్మకపరిశీలనతో, వ్యావహారికవాదులు చూపిన విషయములకు సమాధానమిచ్చుచు, సంస్కృతాంధ్ర వాఙ్మయమునంతటిని, ఆమూలాగ్రము అవలోడన చేయవలసి వచ్చినది. ఇంతేకాక, వ్యాఖ్యవలన కావ్యమందలి కవితా గుణములు పెక్కులు తెలియవచ్చినవి. మతమును గుఱించి తాత్త్విక విషయములను గుఱించియు ఎన్నియో శాస్త్రీయ విషయములు బయలుపడినవి.

డా॥ సి. ఆర్. రెడ్డిగారు వ్యాఖ్యను మెచ్చుకొనుటయేగాక తాతగారి కర్తృత్వ విచార నిర్ణయముకూడ మెచ్చుకొనిరి. వ్యాఖ్యయొక్క ప్రకటన చాల కాలము పట్టెను. మదరాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయమునందలి వ్రాతప్రతులను పరిశీలించి, రాత్రింబగళ్లు వ్రాసి, 1920 నాటికే తాతగారు తమ వ్యాఖ్యను పూర్తిచేసిరి. పిఠాపురము మహారాజావారు వ్యాఖ్యముద్రణమును గూర్చి ఉత్సాహము లేనివారైనందున తాతగారు కాలమున కెదురుచూచుచు ఇతర సాయమునకు ప్రయత్నించుచుండిరి.

# 10. సమ్మానములు - సంతాపములు

తాతగారికి జీవితములో సమ్మానములు కొంత ఆలస్యముగానే వచ్చినవి. వాఙ్మయరంగములో సుప్రసిద్ధుడై, సారస్వతమేరువుగా నుండినను వారిని సభలలో సమ్మానింపవలెనని ఎవరికిని తోచలేదు. వారును అపేక్షింపలేదు. షష్టిపూర్తి చేసుకొనుటగాని, షష్టిపూర్తికి సమ్మాన సంచిక ప్రకటించుటగాని వారికాలమునకు రాలేదు. ఆముక్తమాల్యద వ్యాఖ్య పూర్తియగుచుండగా ఆంధ్రప్రజానీకము వారి సారస్వతసేవను గుర్తించుటకు ప్రారంభించెను. వారిని గౌరవించిన మొదటిసంస్థ ఆంధ్రసారస్వత పరిషత్తు, 1919 లో మదరాసులో వారికి మహోపాధ్యాయ బిరుదము, వేయియునూట పదునాఱు రూప్యములు పారితోషకమునిచ్చి, బంగారుసరిగతో ప్రతింపబడిన శాలువను బహుకరించినది. అప్పుడే ఆపరిషత్తు, తాతగారికి మహామహోపాద్యాయ బిరుదము నొసంగవలసినదిగా రాజ్యాంగమువారికి ఒకప్రతిపాదననుకూడ చేసినది, ఆటుతర్వాత నెల్లూరిలోవర్ధమానసమాజమునుపౌరులునుకలిసి వారికి అభినవమల్లినాథబిరుదమిచ్చి వారివ్యాఖ్యలను కొనియాడిరి. 1922 లో, విండ్సరు ప్రభువు (ఇంగ్లాండు) అప్పుడు ప్రిన్స్ ఆప్ వేల్సుగా నుండినవారు. మనభారతదేశమునకు వచ్చిరి. వారి యాగమన సందర్భమున, మదరాసు విశ్వవిద్యాలయమువారు పండితసత్కారములు చేయుచు, మదరాసు మెరీనా బీచిలో, సెనేటుహౌసులో గొప్పదర్బారుచేసి పండితులకు సమ్మానములు చేసినారు. బంగారుతోడా (కడియము) ఎడమచేత ధరింపబడు సాంప్రదాయికమైన సింహతలాటముతోడిది, దుశ్శాలువలు ప్రధాన పండితులకు ఇచ్చిరి. తాతగారికి సంస్కృత ప్రధాన పండితస్థానము మొదట ఉద్దేశింపబడినది. తర్వాత ఒకానొక, సంస్కృతమొక్కటే ఎఱిగిన, సంస్కృత పండితునికి అవకాశము కల్పింపవలసి వచ్చినది. చివరి నిముసములో మార్పుచేయవలసి వచ్చినది, సంస్కృతములోను తెలుగులోనుకూడ తాతగారికి అగ్రస్థానము కలదు కాబట్టి వారిని తెలుగులోని ప్రథమ బహుమతికి ఒప్పుకొన వలసినదిగా కార్యకర్తలు ప్రార్థించిరి. ఇది ఇబ్బడి బహుమానముగా తాతగారు భావించి, చాల సంతోషించి, తెలుగుబహుమతిని 13 జనవరి 1922లో, (హిజ్ రాయల్ హైనెస్) వేల్సుయువరాజుగారి చేతిమీదుగా గ్రహించిరి.

అటుతర్వాత అచిరకాలములోనే, తాతగారు నెల్లూరులో తమ ఆముక్తమాల్యదా వ్యాఖ్య సహాయము కోరుచు ఉపన్యసింపగా, సభ్యులు ఏకగ్రీవముగా తాతగారిని, మదరాసు వదలి, ఇక మదరాసులో వారికి పని లేనందు వలన, నెల్లూరికే కాపురమును స్థిరముగా మార్చవలసినదిగా కోరిరి. తమ జన్మస్థానమైనందుచేత తాతగారు చాల సంతోషించిరి గాని తాము చదువుకొను పుస్తకములు, విక్రయ ప్రచురణములు, వీనికి తగినయిల్లుండిన

గదాయని శంకించిరి. పైగా తమకు పుస్తకవిక్రయము సక్రమాదాయకరము కానందున వరుమానము విషయము వారిని సమస్యగా ఎదుర్కొనినది. తాతగారి కొకయింటిని కొనిపెట్టుటకు చందాలు వసూలు చేయవలయునని ఒక ప్రతిపాదన వచ్చినది. నెల్లూరు రంగనాయకుల పేటలో, పెన్నగట్టున రంగనాథస్వామి దేవాలయమునకు సమీపమున, ట్రంకురోడ్డుమీద, ఒక యింటిని చూచిరి. వెంటనే ఆ యింటిని కొనుటకు తాతగారి మదరాసుయింటిని, నెల్లూరి క్రొత్తయింటిని, ఐదువేల రూపాయలకు, తాతగారికడ విద్యార్థిగా నుండిన యొకరియొద్ద, తాకట్టుపెట్టి, ధనము సంపాదించుటకు ఏర్పాట్లు జరిగినవి. 1922, మార్చికి కుటుంబము నెల్లూరిలో క్రొత్తయింటిలోనికి మారినది. ఈ నూతన పరిణామమునకు సంతోషించుచుండినను, తాతగారు తమ జీవితములో నొక క్రొత్తదశ ప్రారంభమగుచున్నదనియు, మానసిక వేదనకూడ, క్రొత్తది, పెద్ద కొండంత బరువు, ఏ నిమిషములోనైనను తటాలున నెత్తిన పడునట్టిది, పెద్దఅప్పు, ఏర్పడినదనియు తలంపసాగిరి. అచ్చాఫీసును విక్రయించి, అప్పులుతీర్చి, ఇక అప్పుల బా లేక జీవితము గడుపదలచినవారికి, అప్పు - తమకు అప్రియమైనదే - సంప్రాప్తించుట ఎంత ఆశ్చర్యకరము. కాని తమ స్నేహితులు, అభిమానులు, పూర్వవిద్యార్థులు అందఱునుచేరి, తగినంత సొమ్ము వసూలుచేసి, అదియొక సార్వజనీన ప్రయోజనముగా, అప్పును తీర్చగలరని, దానినొక భారముగా నెంచలేదు.

క్రొత్తయింటిలో ప్రవేశించినప్పుడు శుభశకునమే కలిగినది. ఏదనగా గుజరాత్ దేశపు ద్వారకామఠ శారదాపీఠమువారు, జగద్గురువులు, శ్రీభారతీ కృష్ణతీర్థ శంకరాచార్యులవారు ,తాతగారికి గొప్ప సత్కారము చేసిరి. ఆఱు బిరుదములు, 'మహామహోపాధ్యాయ, విద్యాదానవ్రత మహోదధి, పండిత రాజ, వేదవేదాంగశాస్త్రజాల మహోదధి, సనాతనధర్మ రత్నాకర, సర్వ తంత్ర స్వతంత్ర' అనువానినిచ్చి, నెలకు రు. 150/- మఠమునుండి ఇచ్చునట్లు ఏర్పాటుచేసి, నెల్లూరుటౌనుహాల్లో ఒక దర్బారు జరిపి, మహోత్సవము చేసిరి. రంగనాయకపేటనుండి టౌన్‌హాలు వఱకు, దాదాపు 2 మైళ్లదూరము, రానుపోను ఊరేగింపు జరిగినది. శ్రీ శంకరాచార్యులవారి ప్రతినిధియొకరు నెలూరికి వచ్చి, ఆ బిరుదములను నిండుసభలో తాతగారికి సమర్పించిరి. తాతగారు సకాలమునకు వచ్చిన ఈ గౌరవ సహాయములకెంతో సంతోషించిరి; ఉత్సాహపూరితులైయుండిరి. ఈ శంకరాచార్యులవారు క్రైస్తవ కళాశాలలో, తమ పూర్వాశ్రమములో, తాతగారి శిష్యులు, తర్వాతకూడ తాతగారికడ ఎన్నో శాస్త్రములను అభ్యసించినవారు.

తాతగారికి, ప్రతినెలకు, ఒక నికరమైన ఆదాయము కుదిరినందువలన, తాతగారి శిష్యులకు కొంత నెమ్మది కలిగినది. తమ బాధ్యత, తాతగారి

ఇంటి ఋణమును తీర్చుటవఱకే మిగిలినదని వారు ఊరటనందిరి. కాని ఈ సంతోషమంతయు ఎక్కువకాలము తాతగారు అనుభవింపలేదు. పరిస్థితులు తటాలున మారిపోయినవి. ఆ శంకరాచార్యులవారు రాజకీయములలో ప్రవేశించినారు. వారి మఠము వ్యాజ్యములలో చిక్కుకొన్నది. ప్రతినెలకు పంపుటకేర్పాటైన మనియార్డరు సక్రమముగా పంపుటకు సాధ్యపడలేదు.

1922, డిసంబరు 14 తేది, తాతగారికి తమ జీవితములోనికంతటికిని ఘోరమైన దుఃఖము కలిగినది. అది, తాతగారి ఏకైకపుత్రుడు, మా తండ్రిగారు, కొద్దికాలము జబ్బుపడి, చేత దమ్మిడీలేని ఆర్థిక దుఃస్థితిలో నుండుకాలమున, లేతవయసున అకాలమరణమునందుట. దైవచేష్టలు. దురవగాహములు. ఆ మఱుసటిదినము తాతగారికి స్వాములవారివద్దనుండి, ఆలస్యమునకు క్షమాపణ కోరుచు, పెద్దమనియార్డరు వచ్చినది. అది సకాల సహాయము. అటు తర్వాత, మరల ద్వారకాపీఠముయొక్క వ్యవహారములు కోర్టు చిక్కులలోపడినవి. నెలనెలకు రావలసిన మనియార్డరులు పూర్తిగా వేయబడవలసిన పరిస్థితి వచ్చినది. అప్పు చెల్లించుటకు ప్రయత్నము నిలిపి చేయవలసినవారు చందాలు వసూలు చేయుటకు సభగాకూడి పనిచేయ లేనందువలన, త్వరలో ఋణనివృత్తికి మార్గము కనబడలేదు. నాటక సమాజమువారి కార్యక్రమములును ప్రోత్సాహకరములుగా నుండలేదు. ప్రదర్శనములలో నష్టములు వచ్చినందువలన ఆంధ్రభాషాభిమాని సమాజము కూడ అప్పులపాలైనది. తాతగారికి త్వరలోనే తమ విషమ పరిస్థితి అవగతమైనది. అప్పన్నది 'డామకిల్సు' కత్తివంటిది (తమ నెత్తికి సరిగా వెంట్రుకతో వ్రేలాడదీయబడినది) అన్నది వారికి బోధపడినది. ఏ క్రొత్తకార్యము తలపెట్టినను చిత్తవృత్తి కుదురనీయక అప్పు కంటికి ప్రత్యక్షమగుచుండెను. వారి పుస్తకములు, నోటుబుక్కులు, స్నేహితులకు వ్రాసిన జాబులు చూడగా వారింకను పెక్కు చారిత్రకజానపదనాటకములు వ్రాసి, పెక్కు సంస్కృతాంధ్రకావ్యాదులకు పరిష్కృత ముద్రణములు ప్రకటింపను దలచినట్లు తెలియుచున్నది. అటువంటి పుస్తకములకు నడుమ తెల్లకాగితములుపెట్టి బైండు చేయించుకొనిరి - వానిలో నోట్సు వ్రాసికొనుటకు. కాని, ఏ మంచిభావ ముదయించినను, పని మొదలుపెట్టినను, వెంటనే అప్పులవారి జ్ఞాపికలు వచ్చెడివి. అప్పులవారు కోర్టుల మూలముగా వ్యాజ్యములు తెచ్చి ఒత్తిడి చేసిన యెడల రెండిండ్లును పోవునేమోయనియు, తన మనుమలు తన తర్వాత ఇల్లు వాకిలిలేక, చేత దమ్మిడిలేక దారిద్ర్యమనుభవింతురేమో యనియు దిగులు వారిని బాధింపజొచ్చెను.

ఈ మానసికవ్యధచేతనో, శారీరక రుగ్మతచేతనో తాతగారికి విరేచనములు ప్రారంభమై ఒక నెలవఱకు మంచముపట్టియుండిరి. బ్రదుక

రేమో యనునంతయైనదిగాని ఎట్లో గండము తప్పినది. ఇంత జబ్బుచేసిన తర్వాత, వ్యాధి కుదిరినదిగాని, మునుపటిశక్తి రాలేదు. ఒక గంట కూడ నెమ్మదిగా కూర్చుండు బలము లేకపోయినది. ఎప్పుడును విశ్రాంతి కావలసి వచ్చినది. మంచము మీదనే యుండువారు. మంగలికత్తి తగిలిన తల మండుచుండినందున, క్షవరము మానివేసి గడ్డము పెంచసాగిరి. తమకు ముసలితనమేరాదని తలంచుచుండినవారు తటాలున ముసలివారైనట్లు గ్రహించినారు.

ఇంతబాధలోను ఆముక్తమాల్యదా వ్యాఖ్యానము ఇంకను అచ్చు పడలేదే యన్న దుఃఖము వారిని వేధించుచుండెను. ముఖ్యముగా రెండింటికి డబ్బు కావలసియుండెను - పుస్తకముద్రణమునకును ఇంటి జరుగుబాటునకును. తాతగారి స్నేహితులు కొందఱు తాము ప్రత్యేకముగా ప్రయత్నించి వసూలు చేయుచుండిరి. శ్రీ టి. వి. శివరామయ్యగారు, నెలూరిలో గొప్ప న్యాయవాది, వితరణశీలి, భాషాపండిత పోషకుడు, తాతగారికి, సాంప్రదాయిక విద్వత్సంభావన, రు. 116 లు ఇచ్చి సమ్మానించిరి. శ్రీ గునుపాటి ఏనాదిరెడ్డిగారు, తాతగారి ప్రియశిష్యులు, తాతగారియందు అతి గాఢ గౌరవముగలవారు, తమ గురుదక్షిణగా తాతగారికి కొన్ని సంవత్సరములు ప్రతివర్ష పర్యాప్త ధాన్యదాతలు, తాతగారి ఋణమును తీర్చుటకు రెడ్డి జనసంఘమును సమావేశపఱచి, చందాలు వసూలుచేయుటకు పెద్ద ప్రయత్నమును చేయసాగినారు. ఈ విధముగా బిందువులు బిందువులుగా వచ్చుచుండిన కొద్దిమొత్తములతో తాతగారు ఆముక్తమాల్యదా వ్యాఖ్యాన ముద్రణమును కూడ కొద్ది కొద్దిగా సాగింపనారంభించిరి. 1924 లో, గద్వాల సంస్థానమునకు (నేటి కర్నూలుజిల్లా, పూర్వపు నైజాము రాజ్యాంతర్గతము) పోయి మహారాజా శ్రీసీతారామభూపాలరావు గారిని సందర్శించిరి. రాజాగారు గ్రంథముద్రణార్థము రు. 600/- లును, సంస్థాన మర్యాదగా బంగారుతో జోడు శాలువలును ఇచ్చి సమ్మానించిరి. తాతగారితో సల్లాపించి అటువంటి పండితుని తాము ఇంతవఱకు కని విని ఎఱుగమని ఆస్థానపండితులు శ్లోకము వ్రాసి సమర్పించిరి.

"ఈదృ గధీతీ శాస్త్రే గైర్వాణగ్రంథ జాలేషు
అన్ధ్రగ్రన్థేషు తథా నహిదృష్టః శ్రుతచరోవాఽపి."

నెమ్మదిగా చిన్నచిన్న విరాళములచేత ఆముక్తమాల్యదయొక్క ముద్రణము మూడవవంతు ముగియనుండగా, శ్రీ యరబ్రోలురామచంద్రారెడ్డిగారను నెల్లూరు వదాన్యులు, తమ మొదటిభార్య కీ. శే. శ్రీ శ్రీదేవమ్మగారి పేరట ఆ గ్రంథము పూర్తియగునంతవఱకు కొన్నివేల రూప్యములు విరాళమిచ్చి కొనసాగించిరి. నెల్లూరిలో మంచి ముద్రణాలయము లేనందు

వలన, మదరాసులోనే అచ్చుజరుగవలసియున్నందువలన, తాతగారు మరల కుటుంబమును మదరాసునకు మార్చుకొనిరి. కంటిలో పొర ఏర్పడి, ఒక కంటికి శస్త్ర చికిత్స జరిగినది. కాని పూర్తిదృష్టిరాలేదు. ఎంతో శ్రమపడి ముద్రణమును నెఱవేర్చి 1927లో ప్రకటించినారు. గ్రంథావిష్కరణ మహోత్సవమునకు డా॥ సి. ఆర్. రెడ్డిగారు అధ్యక్షులు. ఇట్టి శాశ్వతకీర్తి ప్రతిష్ఠాపక గ్రంథమును లోకమునకు ప్రకటించు కార్యమున తనకు కూడ అవకాశము దొరకినందులకు రెడ్డిగా రెంతో సంతోషించిరి. అప్పుడు వారు ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు ఉపాధ్యక్షులుగానుండిరి. సిండికేటులో తాతగారికి 'కళాప్రపూర్ణ' బిరుదమును (గౌరవ డాక్టరుపట్టము) ప్రతిపాదించి తాతగారి కిప్పించిరి. ఆ బిరుదమునకు తాతగారే మొదటి స్వీకర్త. అప్పుడు కృష్ణాపత్రిక సంపాదకులు, కీ.శే. ము. కృష్ణారావుగారు, అంతటి మహా పండితునికిచ్చినందువలన, ఆ పండితుని కన్న బిరుదమునకే గౌరవమతిశయించినదని వ్రాసిరి. ఆ దినమే బెజవాడ (నేడు విజయవాడ) పురపాలక సంఘము తాతగారికి పౌరస్వాతంత్ర్యపు గౌరవమును (Freedom of the city) ఇచ్చి బహుమానించిరి. ఇది అపూర్వమును విలక్షణమును ఐన గౌరవము, తాతగారి జీవితమందును ఆంధ్రదేశ చరిత్రయందును అదొక పండుగ దినము. ఆ దినము సాయంత్రము తాతగారి శిష్యులు, ఏలూరు గ్రేటు ఇండియన్ థియేటరువారు, శ్రీయుతులు ముంజులూరు కృష్ణారావు, కే.వి. వరప్రసాదరావుగార్లు ప్రధాన నటులుగా ప్రతాపరుద్రీయ నాటకము నాడిరి.

తాతగారు తమ జీవితవాంఛయైన ఆముక్తమాల్యదా ప్రకాశనమును తమకు చిరకీర్తిదాయకమును నెరవేర్చినారు గాని ఆర్థికముగా ఎట్టిలాభమును పొందలేదు. డెబ్బదిమూడేండ్ల వయస్సున కుటుంబముయొక్క భవిష్యత్తే వారి నిరంతరచింత. అందువలన ఏక్షణము అప్పులవారు ఇంటిని ఏలము పాడి కుటుంబమును వీధికి తఱుముదురోయని దిగులుపడి నిదురపట్టక బాధపడుచుండిరి. ఇట్టి సందర్భమున శ్రీగునుపాటి ఏనాదిరెడ్డిగారి ప్రయత్నములుఫలించినవి; పదివేలరూప్యములు వసూలైనవి. ఋణదాతను, పూర్తి చెల్లుగా 7500-00 రూ మాత్రమే పుచ్చుకొనవలసినదిగా ప్రార్థించి, 1928లో అప్పుతీర్చివేసిరి. ఈశుభవార్త చెవిలోపడిన కొద్దికాలమునకే, తాతగారి తల్లిగారు, 102 ఏండ్లవృద్ధురాలు, తానుకూడవిని, సంతోషించి, గతించినది. శ్రీ ఏనాదిరెడ్డిగారు, తాతగారి అప్పుతీర్చుటతో తృప్తిపడక, ఇంకను కొంత వసూలుచేసి పూర్వము పదునైదవ శతాబ్దములో విజయనగరరాజుల చేత శ్రీనాథమహాకవికి జరిగినట్లు, అత్యపూర్వమైన 'కనకాభిషేకము' (బంగారపు నాణెములతో అభిషేకించుట)ను చేయనుద్దేశించిరి. కాని వారి

అదృష్టము బాగులేదు. కొద్ది కాలము జబ్బుచేసి 1929 సం॥ జూన్ నెల, 18 వ తారీఖున తమ 76వ సం॥మున తాతగారు, శ్రీగునుపాటి ఏనాదిరెడ్డి గారిని, వారి సహాయులైన రెడ్డి సంఘమును దుఃఖసాగరములోముంచి స్వర్గస్థులైరి. ఆంధ్రదేశమునకే ఈ విషయము అఘాతమై కొన్నినెలలు, దినవార మాసపత్రికలలో అవిరతముగా వారిని గుఱించి రచనలు వెలువడుచుండినవి. శ్రీఏనాదిరెడ్డిగారు తాముద్దేశించిన కనకాభిషేకము జరగనందువలన తాము వసూలుచేసిన మొత్తములో ఋణమునకు పోగా మిగిలిన దానిని మా కుటుంబమునకును తాతగారి అముద్రిత గ్రంథ ప్రకాశమునకును వ్యయించిరి.

## ఉపసంహారము

అర్ధశతాబ్దము, 1880 మొదలు 1929, వఱకు వేంకటరాయశాస్త్రిగారు ఆంధ్ర వాఙ్మయమందు అనేక ఘనకార్యములు సాధించి మహాప్రతిష్ఠను సంపాదించిన ఒక మహావ్యక్తి. అదృష్టమును సందర్భములును అనుకూలించి యుండిన యెడల ఇకనెంతో చేసియుందురు. పుట్టుకచేతను సంస్కారముచేతను ప్రాచీన పండితులవంటివారై, సమగ్రకార్యసాధకులును పూర్వాచారపరాయణులునైనను, ఆధునిక విద్యచేతను సంపర్కముచేతను, అత్యంతాధికుల వంటివారైరి. ప్రాచీన పండితుని పుత్రుడైనందుచేత నిఘంటువులను వ్యాకరణమును గుడ్డిపాఠము చేయునట్టి పాతగుణములెన్నియో వారికి సంక్రమించినవి. మొదట కొంత అలక్ష్యముచేసినను అతిత్వరలో సంస్కృతముయొక్క ప్రాముఖ్యమును గుర్తించి, సాక్షాత్తుగా తండ్రిగారి సముఖమున నేర్చుకొనక పోయినను గోడచాటుగానైనను, ఉపాధ్యాయుని విచిత్ర చిత్తమునకును కోపతాపములకును సర్దుకొనిపోయి, ఎంతో సంప్రదాయిక జ్ఞానమును సంపాదించిపేరి. దకుటుంబములోపుట్టి జీవిత ప్రారంభదశనుండియే సంపాదనకు పాటుపడవలసినవారైనందుచేత జీవితములో కష్టములకును ఒడుదొడుకులకును తగినట్లు పైకివచ్చిరి. సూక్ష్మపరిజ్ఞానము జ్ఞాపకశుద్ధి గలవారైనందుచేత, మానవులను గూర్చి వృత్తాంతములను గూర్చి ఎన్నిటినో జ్ఞాపకముంచుకొని, తమ యనుభవమును తర్వాత ఉపయోగపరచుకొనగల్గిరి. ఏకార్యము పూనుకొన్నను అరకొరగాచేయక, సమగ్రముగాను చక్కగాను చేసెడివారు. సంస్కృతపద్ధతిప్రకారము లోతైన పాండిత్యము కలుగగా ఇంగ్లీషు భాషా జ్ఞానము, కళాశాల విద్యాభ్యాసము, విద్యాసంపర్కములును వారికి పాశ్చాత్య పండితులవలె, నవిమర్శక శాస్త్రీయ విద్యాగ్రహణమునకు తోడ్పడినవి.

ఎంతటి ప్రాచీనమార్గనిష్ఠుడో అంతటి ఉదారాధునికుడు. ప్రాచీన మార్గము లను ఎంతవఱకు అభిమానించినా డనగా మన పరంపరాగతజ్ఞానములో ఉత్తమ పద్ధతిని వదలకూడదు, వృద్ధిపఱుపవలెను. ఈ యభిప్రాయములకు పునాదులు బాల్యములోనే పడినవి. భావివిద్యావేత్తలకు తగిన బాల్యము వారిది. వారిసమకాలికులు ఒక్కొక్కరును ఒక్కొక్క విశేషగుణసంపన్నులు. కాని వీరు ఆ గుణములన్నిటియొక్క మొత్తము, సకలగుణముల ప్రోవు.

చక్కనిభాషయో వాఙ్మయమో, ఏరూపములో నుండినను మెచ్చుకొనెడి వారు - అది జానపదవాఙ్మయమైనను సరియే, విశ్వవిద్యాలయ పండిత యోగ్య పరిశుద్ధభాషయైనను సరియే. నేటి అత్యంతాధునిక కవులవలె జాన పదవాఙ్మయమును బుఱ్ఱకథలను వినెడివారు. వారి యభిప్రాయము ప్రకారము మంచికవిత్వము వ్యాకరణమునకును భాషా పారిశుద్ధ్యమునను అతీతమని. హృదయమును ఎదితాకునో అది శాశ్వతముగా నిలుచునట్టిది. అట్లని వారు ఉద్ఘోషించినారు, సంస్కృత వాఙ్మయ సిద్ధాంతము దీనికి అనుగుణము. ప్రాచీ నాలంకారికులు కావ్యవిచక్షణులు దీనిని ఇట్లు ఒక వాక్యములో అనుశా రించినారు - 'రసముగలది కావ్యము' అని ('వాక్యం రసాత్మకం కావ్యమ్') ఇదే సూత్రమును వీరు నాటకములకును సమన్వయపరచినారు. వారి భాషా భిప్రాయములు లోకజ్ఞానముమీదను, ఇంగితజ్ఞానముమీదను, ఆధారపడి నట్టివి. ఎవరైనను ఏదైనను వ్రాయవచ్చును, కాని అది చదువరులకు ఆనందము కలిగించునట్టి రచనయై యుండవలెను. ఆంధ్ర వాఙ్మయములో జానపదసాహిత్యము కోకొల్లు. జనులు మాటాడుకొనుభాషలో ఎన్నో బుఱ్ఱ కథలు వ్రాయబడియున్నవి. రాజపుత్రస్థాన కథలవంటివి, స్కాట్లండు దేశపుపాటల (Ballads) వంటివి, ప్రాచీన వీరగాథలు, భాషాపటిమలోను, రసోద్రేకము కలిగించుటలోను ఇతర సారస్వత ప్రక్రియలను మించి యున్నవి. బాల్యములో వీనినెల్ల వినివిని, పాఠముచేసినవారితో సమాన ముగా జ్ఞాపకముంచుకొని యుండిరి. ఈ జ్ఞానమును తమ నాటకములలో చాల చక్కగా వినియోగపరచుకొనిరి. 'ఎంకిపాట'లను, గ్రామ్యములో వ్రాయబడిన - ఒకతోటమాలి వాని భార్య వారి - ప్రేమగీతములను, మెచ్చు కొని, దాని రచనలో కావ్యత్వమంగీకరించినారు. భావకవి ప్రచారమును కూడ అంగీకరించినారు. ప్రాకృతగాథలవలె వానిలో గొప్ప కవితా విశేష మున్నదని విశదీకరించినారు.

సంస్కృత నాటకములలో నున్నట్లు, వారు వారు మాటలాడుకొను భాషకు ప్రయోగము నాటకములలో అంగీకరింపవలసినదని ఒకవైపు పోరాడుచునే, అట్టి భాషను, శిష్టవ్యావహారిక (విద్యావంతుల గ్రామ్య) మార్గముగా కూడ పాఠశాలలలోను కళాశాలలలోను ప్రవేశపెట్టరాదని అడ్డు

నిలిచిరి. ఆచరణీయమార్గనిష్ఠులుగాన ఎటువంటి భాషలో రచించినను పరవాలేదు, దానికి స్థానమున్నది, దేనిదేనికి ఎంతెంత ప్రయోజన ముద్దేశింపబడినదో దాని దానికి అది తగినదే, పరిమిత ప్రయోజనకారి, కాని విశ్వవిద్యాలయములలోను పాఠశాలలలోను, విద్యావిధానమున బోధింప వలసినది ప్రాచీన వాఙ్మయము, బజారు కవిత్వము కాదు, గాన సార్వ జనీనమైన ప్రామాణికభాషను తప్పక వాడవలయును. బజారు భాషకు ఉపాధ్యాయుడు అక్కరలేదు. ఈ విధముగా వారు భాషాభిప్రాయములలో మధ్యేమార్గము నవలంబించినారుగాని పూర్తిగా మార్పును ఒప్పని పద్ధతి వారు కారు. ప్రాచీన కావ్యపఠనమును ఎక్కువ అభిమానించి దాని పునరుద్ధరణమునకు పాటుపడినారు.

వారి పద్ధతులన్నియు నియమబద్ధములు, మెట్టు మెట్టుగా పోదగినవి. విప్లవాత్మకములో బలాత్కారకములో కావు, వాస్తవముగా వారి నాటక పాత్రోచితభాష, వారు ప్రారంభించినప్పుడు విప్లవాత్మకముగానే తోచినది. అప్పారావుగారు కూడ పందొమ్మిదవ శతాబ్దములో వ్యావహారిక వాదమును ప్రారంభించియుండినయెడల వారి యుద్యమము కొనసాగియుండదు. వేంకటరాయశాస్త్రిగారు, అభివృద్ధి నిరోధకులైన ప్రాచీనులను ఎదుర్కొని, వారి వాఙ్మయ నిరోధములను, శాస్త్రీయవిధానమున కూల్చి, మార్గము చేయకయుండినచో, 1911లో కూడ అప్పారావుగారు, మార్గము దొరకక, అరణ్యములోనే యుండియుండెడివారే. పదునాలుగేండ్ల కాలము (1897 - 1911) రంగమును పదునుచేసినది. వారిని, వారి వాదమును అర్థము చేసికోనివారు, వారు మాఱిపోయినారనియో, లేక తమ, వ్యావహారిక భాషా ప్రయోగమునకైన, మొదటివాదమును 'మరచిపోయినారు' అనియో, వారిని, వారు ఈ క్రొత్త వాదమును ఎదిరించినప్పుడు తప్పు చెప్పినారు. కాని కాలమువలన యథార్థము నిరూపితమైనది. జనులు సాధారణముగా ప్రాంతీయభాషలు మాటలాడినను 'గ్రాంథికభాష' అనగా సామాన్య ప్రామాణికభాషయొక్క స్థానము మారలేదు. వేంకటరాయశాస్త్రిగారి యభిప్రాయములు ప్రముఖరచయితలకును విద్యాసంస్థలకును ఆదరణీయ ములుగానేయున్నవి.

ఇతర రచయితలలో కానరాని వైవిధ్యము వారి రచనలలో కనబడును. శైలి, విషయమునుబట్టియు, ఎవరికి ఉద్దేశింపబడి వ్రాయబడినదో ఆ చదువ రులను బట్టియు మారుచునేయుండును. మాటలును పదములకూర్పులును కూడ పుస్తకమునకును పుస్తకమునకును విషయమునుబట్టి, మారుచునే యుండును. చూచినేర్చుకోదలచువారికి వేంకటరాయశాస్త్రిగారి రచనలలో గ్రహింప దగిన విషయములు చాలగలవు. రచయితలందరికిని కావలసిన ఆదర్శము

లున్నవి. వారి కథాసరిత్సాగరము, దశకుమార చరిత్రము, విక్రమార్కుని కథలు, భోజునికథలు, హితోపదేశము మొదలగునవి ఒక్కొక్కటియు ఒక్కొక్క విశేషగుణముగలవి. కాని వారి నాటకములలో, ఎక్కువ వైవిధ్యము, విస్తృత ప్రయోగావకాశములును కనపడును. వారి నాటకములలోని కొన్ని విషాద సన్నివేశములు ఎంతరసవంతమైన భాషలో ఉన్నవనగా, అవి ప్రేక్షకులను కన్నీళ్లు కార్పించును; వారి చమత్కారము ఎట్టిదనగా కడుపుబ్బనవ్వించును. వారి మూడునాటకములు, మూడుదశకాంతరములలో వ్రాయబడినవిగాన వారిలోని మార్పులను, తర్వాత తర్వాత ఏర్పడిన పక్వ పరిణామ దశలను, వారి సృజనాత్మకశక్తిని చూపుచు, వారు, ఇకనిన్ని నాటకములు వ్రాయక పోయినారేయని మనలను చింతింపజేయుచున్నవి.

వారి వ్యాఖ్యలు ఎన్నో వివిధవిషయములను తెలుపుచు విద్యార్థులకును పండితులకును కూడ గనివలెనున్నవి. సంస్కృతాంధ్ర వాఙ్మయముల పాండిత్యమును, శాస్త్రపురాణ విషయముతో ప్రదర్శించుటయేగాక ఆధునిక విద్యలైన చారిత్రక భౌగోళిక విషయములను శాసనవాఙ్మయమును కూడ తమ వ్యాఖ్యలలో ప్రమాణీకరించియున్నారు. పాఠనిర్ణయ విషయమున మూలరచయిత హృదయమును గ్రహించునట్టి, ఒక లోతైన అపూర్వదృష్టి వారికుండినది. అందువలన వారిసవరణలు, చాలవఱకు, తర్వాత దొరకిన, తాళపత్ర పాఠములతో సంవదించుచున్నవి. వారిదృష్టి కవిహృదయమును గుర్తించుటయందు లగ్నము. కవిహృదయమనగా కవి ఏమిచెప్పదలచెనోఅది; వాచ్యార్థముకాదు. ఈ విశేషగుణమునకు కారణము సర్వవిధముల, వారి ప్రవచనశక్తి. విద్యార్థులకు బోధించుటలో వారుపుట్టుకచేతనే ఉపాధ్యాయులు. విద్యార్థుల శక్తి సామర్థ్యములను గుర్తించి, విషయముయొక్క కాఠిన్యమును గమనించి, అందులకు తగినట్లు బోధించెడివారు. విద్యార్థులను తయారుచేయుటలో — పాండిత్యము సంపాదించుటకుగాని, ఊరక పరీక్షలో నెగ్గుటకుగాని తగినట్లు తయారుచేయుటలో - సమర్థులు. తమరచనలలో ఒకచక్కని నిర్ణీత మార్గమున, ఏవిషయమునుగాని, కూలంకషముగా స్పృశించుపద్ధతి వారిది. గిడుగువెంకటరామమూర్తి పంతులుగారుకూడ, సూర్యరాయాంధ్ర నిఘంటువును విమర్శించు సందర్భమున, తాతగారు నిఘంటు సంపాదకులుగా నుండి కొనసాగించి, వారి చేతిమీదుగానే నిఘంటువు పూర్తియై యుండినయెడల ఇంతకన్న ఎంతో బాగుగా నుండి యుండును - అని వ్రాసిరి.

ముఖాముఖిగా, సంభాషణాపరులుగా, వారిశక్తి దేదీప్యమానము. సంభాషణకు మంచి ఉదంత కథనము రుచివర్ధకము. వారికి తెలిసినన్ని ఉదంతములు, ఒకప్పటికి ఐపోనంతటి నిధివంటివి, ఎన్నియోయుండెడివి. కీ. శే. శ్రీ జి. వి. సుబ్బరామయ్యగారు వాపోయినట్లు, వేంకటరాయశాస్త్రిగారిని

గుఱించి వ్రాయుటకు ఒక బాస్వెల్ వంటి (జీవిత చరిత్ర రచయిత) లేకపోయినది వాస్తవముగా దుఃఖకరమే. ఉదంతముల (anecdotes) కథనము మాత్రమే గాక హాస్యము వారికి పెట్టనికోట. ఏవిషయమైనను వ్యాకరణముకూడ, వారి చేతిలో పడిన, దానిహాస్యము, పైపంచెకు మేలు సరిగంచువలె, ఎంతో శోభను కూర్చెడెది, తమ యుపన్యాసములలో శ్రోతలను పడిపడి నవ్వునట్లు చేయువారు, తాముమాత్రము నవ్వువారు కారు, గంభీరముగా నుండెడివారు. ఉపన్యాసములలో వారికొక పద్ధతి యుండెడిది. వలయము చుట్టును వలయమును వ్రాయుచు, పెంచుకొని పోయినట్లు, మొదట సూక్ష్మముగా సూత్ర ప్రాయముగా విషయమును చెప్పి, చుట్టుచుట్టుగా దానిని పెంచెడివారు. ఉపన్యాసము నడుమల కాలపరిమితి మీరిపోవుచున్నదని ఎవరైనను తటాలున నిలిపినయెడల, విషయము మాత్రము సమగ్రముగానే చెప్పబడి యుండునట్టి పద్ధతి. ఒకవేళ ఉపన్యాసములో కొన్ని ఉదాహరణములు నష్టమైపోయిన పోవచ్చునుగాని విషయము పూర్తిగా ఉండును. ఐదు నిమిషములుగాని పదునైదు నిమిషములుగాని, అరగంటగాని, గంటగాని, ఈ యుపన్యాస పద్ధతి శ్రోతలకు విషయమును పూర్తిగా ఆకళింపునకు తెచ్చుచు, చాల చక్కగా కుదిరి యుండెను.

వ్యక్తిగావారు, వారికి పరిచితులైనవారికి, చాల హృదయమిచ్చిన స్నేహితులుగా నుండిరి. వారి మాటలు, అభిప్రాయములు, చాల కటువుగా, కనబడినను, వానిలోపల మార్దవమేగాని కాఠిన్యముండెడిదిగాదు. ధనము విషయములలో చాల అలక్ష్యము. తాము అప్పిచ్చి, ఆ బాకిపడిన స్నేహితులు, నెమ్మదిగా ఇచ్చినప్పుడే పుచ్చుకొనెడివారు. వాస్తవముగా, వారి స్నేహితులు, వారి నిర్యాణానంతరము, వారియొద్ద ఎప్పుడో తాము పుచ్చుకొన్న అప్పును, నాకు, వారి మనుమనికి చెల్లించియున్నారు. వారి నిత్య కార్యక్రమములు, అలవాట్లు, వారి నిరంతర విద్యాగ్రహణమునకు తగినట్లు, కాలహరణములేని, కాలసంక్షేపమార్గమున నుండెడివి. ప్రతిక్షణమును విలువయైనదే. వ్యర్థముగా ఏవిషయముమీదను కాలమును పుచ్చువారు కారు, వారిని ఎప్పుడు చూచినను, ఎడమచేత పుస్తకము, కుడిచేత కలముతో నుండెడివారు. పగలేగాదు, రాత్రులుకూడ పనిచేసెడివారు. క్యాండిలు దీపమును పెట్టుకొని రాత్రి చాలసేపు చదివెడివారు. సూర్యోదయ మునకు చాల ముందేలేచి, కాఫీత్రాగుటకు బాగుగా అలవాటైనవారుగాన గత శతాబ్దము 1880 ప్రాంతమునుండియే తమకు కావలసిన విధమున, ఆ కాఫివాసన వచ్చునట్లు తామే చేసికొని త్రాగువారు. వారిగదిలో చదువు వ్రాతబల్లగాక, ఒకమూల కాఫీచేసికొనుటకు మరియొకబల్ల అమర్చి

యుండెడిది. వారిచేతికాఫీ త్రాగుటకు వారిమిత్రులు కొంతమంది సరిగా ఆ సమయమునకు వచ్చెడివారు. వారి కాఫీఅలవాటు సర్వాంధ్రప్రసిద్ధమేగాని వారి అభిని అలవాటు చాలమంది ఎఱుగరు. రాత్రింబగళ్లు పనిచేయుటచేత వారికి, ఇతర విధములైన 'టానిక్' మందులు కావలసి యుండెడివి. ఎన్ని విధములైన కాడ్‌లివర్‌ఆయిల్ టానిక్కులో అయుర్వేదౌషధములో పుచ్చు కొనుచనే యుండువారు. ఎలెక్ట్రిక్కు దీపములు వచ్చిన తర్వాతకూడ క్యాండిలు దీపములను వారు వదలలేదు. ఈ విద్యుచ్ఛక్తి నిరంతరాయముగా వచ్చునను నమ్మకము వారికికూడ లేకుండెను. అవి ఆరిపోయినను క్యాండిలు దీపము లుండెడివి. వ్రాయుటకు మూడు నాలుగు పెద్ద పౌంటెన్ పేనాలు పెట్టుకొని, వానిలో, సిరాబుడ్డు పూర్తిగా ఖాలియగునట్లు ముందుగానే పోసి పెట్టుకొని, కాలహరణము కానీయక, తమ ఆలోచనలును, పేనాలో సిరాయు, ఏకధారగా, నిలువక, వచ్చునట్లు వ్రాసికొని పోయెడివారు. బ్రాహ్మణునికుండ వలసిన ఆచారాదికములను పాటించువారే అయినను ఎట్టి వేషాడంబరము గాని వారికడ నుండెడిదికాదు. గుడులకు, భగవద్దర్శనాదులకు ఎప్పుడో గాని పోయెడివారుకారు.

తాతగారి శరీరచ్ఛాయ ఎఱుపు తిరిగిన తెలుపు, ఎక్కువ పొడుగుగాని పొట్టిగాని కాని ఎత్తు, చక్కని గట్టి దృఢశరీరము, పొడుగుపాటి ముక్కు, ప్రేమ చిలుకు నేత్రములు, గొప్ప రాజపుత్రునివలె నుండెడిది వారిరూపము. డాక్టర్ జాన్‌సన్‌వలె శరీరము లావెక్కినదిగాని గంభీరముగా నుండెడిది. నిర్దాక్షిణ్యమైన వార్ధక్యము మెల్లగా వారిలోను ప్రవేశించి, కార్యభారముచే నలిగిన వారి శరీరమును సులువుగా అపహరించినది. కాని ఆంధ్రవాఙ్మయ ప్రపంచమున వారి అడుగుజాడలు స్పష్టముగా నిలిచిపోయినవి. సమకాలిక విద్యావేత్తలలో, ఎంతో ఎదిరింపును సహించి పోరాడి తమ స్థానమును నిలుపుకొన్న వారగుటచేత వీరిజీవితము మరింత గాంభీర్యవంతమై ప్రకాశించుచున్నది.

## ముఖ్యమైన తేదులు, సంఘటనలు, గ్రంథములు

| సంవత్సరము | విషయము |
|---|---|
| 1853 : | 21 డిసంబరు, వేదము వేంకటరాయశాస్త్రిగారి జననము. |
| 1875 : | వే. వేం. శాస్త్రిగారు F.A.లో ఉత్తీర్ణులగుట. |
| 1879 : | వీరేశలింగము పంతులుగారు వితంతు వివాహములమీద మొదటి ఉపన్యాసమిచ్చుట, వేంకటరాయశాస్త్రిగారు దానిని ఖండించుట. |
| 1883 : | వే. వేం. శాస్త్రిగారు వితంతు వాదములను ఖండించుచు వ్రాసిన గ్రంథమును ప్రకటించుట. |
| 1886 : | వే. వేం. శా. మదరాసు క్రైస్తవ కళాశాలలో సంస్కృత పండితులుగా నియమింపబడుట. |
| ,, : | ప్రచురణములు : తెలుగు (1) ప్రక్రియాఛందస్సు (2) అలంకార సారసంగ్రహము. సంస్కృతము (3) భోజచరిత్రము (4) విక్రమార్క చరిత్రము (5) బిల్హణీయము (చౌరపంచాశికా) తెలుగు టీకతో. |
| ,, : | ప్రతాపరుద్రీయ నాటకకథ – మొదట 'జనవినోదిని' లో ప్రకటింపబడినది. |
| 1890 : | వే. వేం. శాస్త్రిగారు తమ జ్యోతిష్మతీ ముద్రాక్షరశాలను ప్రారంభించుట. |
| 1891 : | కథాసరిత్సాగరము – ప్రథమముద్రణము ప్రకటింపబడినది. |
| ,, : | నాగానందము తెలుగు అనువాదము ప్రకటితము. |
| 1896 : | అభిజ్ఞానశాకుంతలమునకు తెలుగు అనువాదము, ప్రథమ ముద్రణము. |
| 1897 : | ప్రతాపరుద్రీయ నాటకము – ప్రథమముద్రణము – ఏప్రిల్, (గురుజాడ అప్పారావుగారి కన్యాశుల్క ప్రథమ ప్రకాశనము) |
| 1898 : | జక్కన 'విక్రమార్క చరిత్ర ముద్రణ విమర్శనము' – దానిని ముద్రించిన సంపాదకుల మీది విమర్శ. |
| ,, : | 'ఆంధ్ర ప్రసన్నరాఘవనాటక విమర్శనము' – కొక్కొండ వేంకటరత్నము పంతులవారి అనువాదము మీది విమర్శ. |
| 1899 : | 31 ఏప్రిలు – 'ఆంధ్రభాషాభిమాని సమాజము' అను నాటక సభ, శాస్త్రిగారి నాటకములనాడుటకే ప్రారంభింపబడుట. |
| 1901 : | గ్రామ్యభాషాప్రయోగ నిబంధనము — నాటకములలో నీచ పాత్రలకు గ్రామ్య ముపయోగింపరాదనువారిని విమర్శించుచు ప్రకటించుట. |

1901 : మోహాకుసుమామోద విచారము — ప్రకటన.
1901 : ఆచార్య టి. ఎమ్. శేషగిరిశాస్త్రిగారి నిర్యాణము.
,, ఉషానాటకము — తెలుగునాటకము - ప్రకటన.
1902 : మేఘసందేశము : తెలుగుటీకతో ప్రకటించుట.
1908 : జ్యోతిష్మతీ ముద్రాక్షరశాలను మరల ప్రారంభించుట —

## సంస్కృత ప్రచురణములు

1909 : పుష్పబాణవిలాసము, అమరకోశము, శబ్దమంజరి, బిల్హణీయము - తెలుగుటీకలతో.
1910 : క్రైస్తవకళాశాల ఉద్యోగమునుండి విరామము.
రఘువంశము - మొదటి ఆఱుసర్గలు తెలుగుటీకతో
కుమారసంభవము — ,, ,,
అమరుకావ్యము — తెలుగుటీకతో
రసమంజరి — ,,
భర్తృహరి శతకత్రయము - ,,
ప్రియదర్శికానాటిక - ,, , నాటకమువలె తెలుగు అనువాదముతో
హితోపదేశము - తెలుగు వచనానువాదముతో
దశకుమారచరిత్ర - ,,
విక్రమార్క చరిత్రము - తెలుగుటీకతో పునర్ముద్రితము - ఆంధ్రానువాదముతో.
(అనువాదము ప్రత్యేకవచనముగా కూడ ప్రకటితము.
భోజచరిత్రము - పునర్ముద్రితము. తెలుగుటీకతో. (అనువాదము ప్రత్యేకవచనముగా కూడ)
పంచతంత్రము — మూలము మాత్రము.

## తెలుగు ప్రచురణములు

పారిజాతాపహరణము - మూలము మాత్రము, పరిశోధితముద్రణము, చక్కని పాఠములతో.
ఆంధ్రబిల్హణీయము — ,,
జ్ఞానవాశిష్ఠ రామాయణము -
సారంగధరచరిత్ర - లఘుటీకతో
విజయవిలాసము - ,,

సారంగధర (ద్విపద) లఘుటీకతో
కావ్యాలంకారచూడామణి - మూలము - పునర్ముద్రితము.

1912 : జి. వి. అప్పారావుగారి వ్యావహారిక ప్రచారమును ఎదుర్కొని తమ నిడుదవోలు ఉపన్యాసమును గ్రామ్యాదేశనిరసనమును ప్రకటించుట.

1913 : శృంగారనైషధ వ్యాఖ్య - ప్రకటించుట.

1914 : 14 నవంబరు, జ్యోతిష్మతీ ముద్రాక్షరశాలతో నెల్లూరికి కాపురము తరలించుట.

1915 : డిసంబరు — అచ్చాఫీసుతో కూడ మదరాసుకు తిరిగి వచ్చి, సూర్యరాయాంధ్ర నిఘంటు ప్రధాన సంపాదకత్వమును పూను కొనుట.

1916 : పోషకులు, వేంకటగిరి మహారాజా శ్రీ గోపాలకృష్ణయాచేంద్రుల వారి నిర్యాణము.

1918 : సూర్యరాయాంధ్రనిఘంటు సంపాదకత్వమునుండి విరామము

1919 : జ్యోతిష్మతీ ముద్రాక్షర శాలా విక్రయము.
కాళిదాసు మాళవికాగ్ని మిత్రమును అనువదించి (రంగోచితముగా కూడ) ప్రకటించుట.
ఆంధ్ర సారస్వత పరిషత్తువారి, మహోపాధ్యాయ బిరుదము, రు 1116-00 లు బహుమతి నందుట.
ఆంధ్ర సాహిత్యపరిష దధ్యక్ష పదవి వహించుట

1920 : విమర్శ వినోదము - సంస్కృతాంధ్ర గ్రంథములలోని కొన్ని పాఠ ములను గుఱించినది.
,, తిక్కనసోమయాజి విజయము - తిక్కనమీది యుపన్యాసము.
,, భవభూతి యొక్క ఉత్తరరామ చరిత్ర — అనువాదము, భవభూతి గ్రంథములన్నిటి మీది విమర్శతోటి విపులమైన ఉపోద్ఘాత ముతో ప్రకటితము.
,, ఆముక్తమాల్యద వ్యాఖ్య విరచితము

1921 : విక్రమోర్వశీయము - అనువాదము
రత్నావళీ నాటిక — ,,
సాహిత్య దర్పణము - ఆంధ్రానువాదము రచితము.
ఆంధ్ర హితోపదేశ చంపువు - హితోపదేశము చంపువుగా ఆంధ్రీ కృతము.

1922 : (క్రీ.శే.) విండ్సర్ ప్రభువు ప్రిన్స్ ఆఫ్ వేల్సుగా వచ్చినప్పుడు మదరాసు విశ్వవిద్యాలయమువారు గౌరవించుట.

1922 : నెల్లూరికి కాపురము మార్చుట - ఇండ్లమీద ఋణము.
1922 : అటు బిరుదములతో ద్వారకా పీఠము శ్రీశంకరాచార్యుల వారిచేత సమ్మానము - సర్వతంత్ర స్వతంత్ర, మహామహోపాధ్యాయ - ఇత్యాది
,, ఏకైక పుత్రుడు వెంకటరమణ (శాస్త్రి) మృతి.
1923 : చిత్తూరు ఆంధ్ర మహాసభ (రాజకీయ) అగ్రాసనాధిపత్యము.
1924 : గద్వాలులో మహారాజావారి సమ్మానము.
1925 : ఆముక్తమాల్యదా ముద్రణార్థము మరల మదరాసుకు కాపురము మార్చుట.
1927 : 'ఆముక్తమాల్యదా ప్రకాశనము - వ్యాఖ్యతో. (డా॥ సి. ఆర్. రెడ్డిగారి అధ్యక్ష్యమున సభ.)
1927 : 'కళాప్రపూర్ణ' బిరుదము ఆంధ్ర విశ్వవిద్యాలయముచే పొందుట.
,, : 'బెజవాడ పౌరస్వాతంత్ర్య' గౌరవము నందుట.
1928 : శ్రీ గునుపాటి ఏనాదిరెడ్డిగారు అప్పులు తీర్చి కనకాభిషేకమును చేయగోరుట.
1929 : జూను 18, ఉదయము 5-45 మదరాసులో వేంకటరాయ శాస్త్రిగారి నిర్యాణము.

## కొన్ని ఉపయుక్త గ్రంథములు

(పుస్తక రూపమున దొరకునవి)

| రచయిత | పుస్తకము |
|---|---|
| 1. వేదము వేంకటరాయ శాస్త్రి (మనుమడు) | వేదము వేంకటరాయశాస్త్రి జీవిత చరిత్రము. |
| 2. ధరణికోట వేంకటసుబ్బయ్య | వే.వేం.శాస్త్రి జీవిత చరిత్ర - ఆంధ్ర సాహిత్య దర్పణమునకుపోద్ఘాతము. |
| 3. గుఱ్ఱము వేంకటసుబ్బరామయ్య | వేంకటరాయశాస్త్రి సంస్మృతి (రచయిత చేతనే ప్రకటితము.) |
| 4. వేంకటరాయశాస్త్రి శతవార్షికోత్సవ సంచిక. | పెక్కు రచయితల సంపుటి. నెల్లూరి వర్ధమాన సమాజము వారి ప్రచురణ |
| 5. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి | నలుగురు వక్తలఉపన్యాసములు-. |

1. వే. రామదాసయ్యంగారు 2. మ. కోదండరామరెడ్డి
3. వేదము వేంకటరాయశాస్త్రి (జూనియర్) 4. ది. వేంకటావధాని.